## తుకా పంచకము

తుకా నామ గజపతిపుత్రీ కృష్ణదేవరాయపత్నీ.

చన్యానాం తే నవమంజరీషు నమత్సు దో గంధఫలీ మజిఘ్రత్
సా కింన రమ్యా సచ కిం న గన్తా బలీయసీ కేవలమీశ్వరాజ్ఞా (1)

మా కింశుక ప్రకటయాత్మని మేచకమాత్రం
మస్మత్కృతే విహరతీతి మధువ్రతోయం।
కిం మాలతీ విరహవేదనయా త్వదీయం
దృష్ట్వా ప్రసూనమచిరా దనలభ్రమేణ (2)

భ్రమర భ్రమతా దిగన్తరాణి క్వచి
దాస్వాదిత మీక్షితం శ్రుతం వా
వద సత్యమపాస్య పక్షపాతం
యది జాతీకుసుమానుకారి పుష్పం॥ (3)

కుసుమాని లిఖన్తునామ చిత్రే
కతిచిత్ కావ్యవిశేషరూఢ శిల్పాః,
సురభిత్వమమూని కిం లభన్తే,
కిముచ్చైస్తేషు రసంపిబన్తి భృంగాః (4)

కిం మాలతి మ్లాయసి మాం విహాయ
చుచుంబ తుంబీకుసుమం షడంఘ్రిః
లోకే చతుర్భిశ్చరణైః పశుస్స్యాత్
స షడ్భిరత్యర్థ పశుర్న కిం స్యాత్! (5)

---

(Sources of Vijayanagar history by
Sri S. Krishnaswamy Ayyangar, M. A. Page - 143 - 144

సుమారు ఇరువది సంవత్సరములందు జరిగిన గాథ యీ నవలయందు పది దినములలో (దశ రాత్రములలో) చూపఁబడినది. స్థానైక్యము (Unity of Place) కొఱకట్లు చేయవలసి వచ్చినది. పాఠకులు విజయనగరమందుండియే, దశరాత్రోత్సవములఁ దిలకించుచు, ఇందలి గాథను తెలిసికొనగల్గునట్లు కథా సంవిధాన మొనర్చితిని.

పాత్రపోషణమున నా చేతనైన ప్రయత్నముఁ జేసితిని. ఈ నా ప్రయత్నమునకు విలువకట్టు భారము పాఠకులది. సహృదయు లీ 'శుక్లాంబ'ను సమాదరింతురని ఆశించుచున్నాను.

జయ విజయదశమి. రచయిత.

## ఉపక్రమణిక

"ప్రభూ ! నా దొక్క మనవి."

ఆమె నును లేత చెక్కిళ్ళను నిమురుచు -'ఏమి?' అని ప్రశ్నించి తన పిపాసితదృక్కుల నామధురమోహనముగ్ధవిలాసినీ దృక్కులతోఁ గలిపినాఁడు కొండవీటిప్రభువు. ఆమె సౌందర్యపూర్ణ హావభావవిలాసాదులను వీక్షించి తన్మయుఁ డైనాఁడు. అస్తంగతారుణకిరణప్రసారమున నామెనును లేత చెక్కిళ్లు రాగరంజితములై, ప్రభులాలనమున లాక్షారసరక్తిమ ననుకరించుచున్నవి. చిఱుగాలితరగల నామెవలిపంపుపైట మకరధ్వజకేతన మైనది. సౌధవాతాయనపార్శ్వమున నున్న అంతఃపురోద్యానతరురాజి బంగరునీట జలకమాడినది. నిజతీక్ష్ణకిరణప్రసారముచే లోకము నుడికించిన చండభానుఁడు మెల్లగ దిగజాఱి పడమటిదిశయం దున్న బురుజుమాటున కేఁగినాఁడు. ఆహా! ఆయుదయమునకుఁ బరిణతి యీయస్తమయము! ఆయున్నతికిఁ బరిణతి యీయవనతి!

"ప్రభువులు విజయనగరయాత్రాసన్నాహముల నున్నారట, నిజమేనా?"

"అవును."

"అయిన నా దొక్క మనవి."

"ఏ మది?"

"ప్రభువు లీదాసురాలినిఁగూడ వెంట ననుమతింపవలెను."

ప్రభువు విలాసినీ కేశపాశముల సవరించుచు - "విలాసినీ! అంతదూరము నీ వేల? సామంతుల మగుట ప్రభుదర్శనమున కేఁగుట మాకు తప్పదు. నవరాత్రోత్సవములు ముగిసిన వెంటనే మఱలి వత్తుము. ఈమార్గాయాసమును నీ వోర్వ లేవు," అనెను.

"విజయనగరప్రభువుల దశరాత్రోత్సవావలోకనకుతూహలము నా కీనాఁటిది కాదు. దేశము నలుమూలలనుండి సమస్తకళావిశారదు లట కేతెంతురని వింటిని. సార్వభౌములు వారి విద్యలఁ బరీక్షించి సంభావింతురట! ఆయుత్సవసమయమున సామ్రాజ్యశోభ యట మూర్తీభవించు నందురు. ఆకొలువు కూటమును వీక్షింప మనసు పుట్టినది. ప్రభువు లనుమతించుచో సార్వభౌములయెదుట నాయల్పవిద్యనుసైతముఁ బ్రదర్శింతును."

"రాజసమ్మానకాంక్ష యున్నదా?"

"ప్రభూ! గౌరవాకాంక్ష మానవసహజముగదా! కేవలము సమ్మానము నాయాశ్రితము కాదు. ఇచట నా కేమి లోటు కలిగినది? నాగురువులైన శ్రీ లక్ష్మీధర, లక్ష్మీనారాయణ పండితులు విజయనగర మేఁగి రెండుసంవత్సరము లైనది. ఈమధ్య వారిదర్శనము కాలేదు. గురుదర్శనభాగ్యముగూడ లభించును."

వారిరువురి నామములు వినినంతనే ప్రభువుహృదయమున నొకవిధమైన శ్రద్ధాభక్తు లుదయించెను. ఆమహాపురుషుల దర్శనముకొఱకు కాతనిహృదయముసైతము త్వరపడుచుండెను.

ప్రభువు ప్రసన్నముఖుఁడై -"విలాసినీ! నీయాప్సితము నెఱవే రునుగాక! నీవు మాతోఁగూడ సామ్రాజ్యరాజధాని కేతెంచుట కెట్టి యభ్యంతరమును లేదు. నీ లగుచో నీవిద్యాప్రదర్శనమున కవకాశమును కల్పింపఁబడును," అనెను.

విలాసినిమోమున హాస్యరేఖ లుదయించి యుదయోన్ముఖుఁడైన శీతమయూఖమయూఖముల గేలిసేయుచున్నవి. అప్రియత్నముగ నామెకరములు ప్రభుపాదపద్మముల స్పృశించినవి. ఆమెహృదయము శ్రద్ధానురాగపరిపూర్ణమై తొణికిసలాడినది. ప్రభు వామెను లేవనెత్తి గ్రుచ్చి కవుంగలించినాఁడు. ఇరువురు నచటినుండి సౌధోద్యానమున కరిగినారు.

నాదెండ్లగోపమంత్రి కొండవీటిప్రభువు. శ్రీకృష్ణరాయ సార్వభౌములు కొండవీటిని ముట్టడించినపు డీగోపయామాత్యుఁడు సార్వభౌములవెంట వచ్చినాఁడు. శత్రుదుర్భేద్యమైన యీదుర్గమును వశపఱచుకొని గజపతిసేనలఁ జీల్చి చెండాడుటలో నీతఁడెనలేని సాహసోపాయములఁ జూపినాఁడు. అందుచే సార్వభౌములు కొండవీటివిజయానంతర మాదుర్గమును గోపయామాత్యులవశ మొనరించి తమకుఁ బ్రతినిధిగ కొండవీటిమండలము నేలుటకు నియమించినారు. సార్వభౌముల కీతనిపై విశేషాదరాభిమానమునకుఁ గారణ మీతనిశౌర్యసాహసోపజ్ఞలే గాక సామ్రాజ్యమహామాత్యులైన తిమ్మరుసున కీతఁడు మేనయల్లుఁడగుటగూడ నొక కారణ మందురు. గోపమంత్రి కొండవీటిదుర్గపాలకుఁ డగుటయేగాక సామ్రాజ్యామాత్యవర్గమున

నొకఁ డగుటచే సార్వభౌముల కీతఁడు సన్నిహితుఁడు. సంవత్సరమున విశేషభాగ మాతనికి విజయనగరముననే గడచును.

ప్రతిసంవత్సరమును సార్వభౌములు శరన్నవరాత్రోత్సవము జేయుదురు. ఆయుత్సవమునకు సామంతులును, మండలేశ్వరులును, అమరనాయకులును నేతెంచి యుత్సవమును జయప్రద మొనరించుట యనూనాచారము. సార్వభౌముని వద్దనుండి గోపయామాత్యున కాహ్వానము వచ్చినది. పదిపదునైదుదినములనుండియు విజయనగరప్రయాణసన్నాహములు గావింపఁబడుచుండెను. తనయనుపస్థితియందు దుర్గరక్షణభారము వహించుటకు వినుకొండలో నున్న దేశయామాత్యునకుఁ గబురు పంపినాఁడు గోపమంత్రి.

ఇఁక విలాసినివిషయము. ఆమె దొక యపూర్వచరిత్ర. ఆమెజన్మవృత్తాంతము లోకమునకుఁ దెలియదు. తా నేజాతికిఁ జెందినదియు నామెకే తెలియదు. ఇయ్యది పదునెనిమిదిసంవత్సరములనాటి గాథ. అయ్యవి కొండవీఁడు శ్రీకృష్ణదేవరాయలకు వశమైన తొలిరోజులు. విజయనగరసార్వభౌములు దిగ్విజయయాత్ర జేసి కటకమునుండి మఱలివచ్చిన తరువాతిగాథ.

శ్రీలక్ష్మీనారాయణదీక్షితులు కొండవీటియాస్థానమున సంగీతవిద్వాంసులు. వారు, కొండవీఁడు ప్రతాపరుద్రగజపతి యధీనమున నున్ననాటినుండియు నాయాస్థానముననే యుండిరి. యుద్ధములు జరిగినవి. రాజులు మారినారు. కాని వారుమాత్ర మాయాస్థానమును వీడలేదు. అభిజనము దుస్త్యజముగదా! గజపతుల ప్రభుత్వమున వారు విశేషమన్నన లందిరి. గోపయా

మాత్యుని పాలనమునఁగూడ యథాపూర్వముగ వారికి గౌర వము జరుగుచునేయుండెను.

ఒకనాటిసాయంకాలము దీక్షితులు రాజదర్శనానంత రము నిజగృహోన్ముఖులై వచ్చుచుండిరి. రాజమార్గమున నడ చుచుండ నొకగృహమునుండి విపంచికానాదము వినవచ్చెను. దీక్షితు లొక్కింతతడ వచటనే నిలిచిరి. వీణియమెట్లు సవరింపఁ బడుచుండెను. ఒక కిన్నెరకంఠి శ్రుతి యాలపించి కీర్తన ప్రారం భించినది. దీక్షితు లట్లే నిలువఁబడియుండిరి. సంగీతమున నామె పాండిత్యముకంటె కంఠస్వరమునందలి మార్దవము దీక్షితుల నాకర్షించినది. దీక్షితులు మెల్లగ గృహములోని కేఁగినారు. ఒకవృద్ధనారి దీక్షితులకు స్వాగత మిచ్చి లోనికిఁ గొంపోయి నది. "ప్రభువు లేదిరో పనిమీద వచ్చినారు." అనిన దా వృద్ధ.

"ఏమియు లేదు. ఆచిన్నదాని సంగీతము వినుటకు."

ఆవృద్ధనారి దీక్షితులను ప్రక్కగదిలోనికిఁ గొంపోయి నది. ఆసనముపైఁ గూర్చుండబెట్టినది. దీక్షితులను గాంచి యాపాడుచున్నయువతి నమస్కరించినది. "సౌభాగ్యప్రాప్తి రస్తు!" అని దీవించినారు దీక్షితులు.

"అమ్మాయీ! ఇపుడు పాడినకీర్తన మఱియొకపర్యా యము పాడుము." అనినారు.

ఆయువతి లజ్జావినయసంభ్రమములతో నించుక సంశ యించినది. పిమ్మట మఱల రాగ మాలపించినది. కీర్తన పాడి నది. తరువాత దీక్షితులు వీణియ నందుకొని తంత్రులు సరి

చేసి రాగ మాలపించినారు. ఆమె తన యాలాపనలోని దోష మును, తంత్రీమేళనమున నున్న లోటును గ్రహించినది. తాను మరల పాడి వినిపించినది. దీక్షితులు ప్రసన్నులైనారు. ఆమె హృదయమున దీక్షితులయెడ శ్రద్ధాభావము వెల్లువలైనది. దీక్షితులకు నమస్కరించినది. సవినయముగఁ బ్రార్థించినది— "స్వామీ! నేటినుండి యీ దీనురాలిపై శిష్యవాత్సల్యముఁ జూపి యుద్ధరింపవలెను. మాతాపితృహీననైన నాకు మీరే తల్లియుఁ దండ్రియు." నని.

'మాతాపితృహీన' యని వినినంతనే దీక్షితులకుఁ గరుణ కలిగినది. ఆవృద్ధనారిని ప్రశ్నించినారు— "ఈపిల్ల నీ కే మగును?" అని.

"అయ్యా! పండ్రెండు సంవత్సరములపూర్వపు విష యము. నేను రాఘవేశ్వరస్వామిరథోత్సవమున కేఁగి స్వామివా రాలయప్రవేశమైనంతనే యింటికి మరలితిని. నామేళము లోనివా రందరుఁ దమతమయిండ్లకేఁగిరి. నేను నాయింటి కేతెంచి లోని కేఁగుచుండ నరుగుపై నొకశిశువు కన్పించినది. నే నాశిశువు నెత్తుకొని లోని కేఁగి యాపిల్లతల్లికొఱకు ప్రతీ క్షించితిని. కాని యెంతసేపటికిని ఆపిల్లకొఱ కెవ్వరును రాలేదు. అప్పటికే రాత్రి రెండుజాములు దాటినది. తెల్ల వారినపిమ్మట వత్తురేమో యని యాబాలికను జోకొట్టి నిద్ర పుచ్చితిని. వారములు గడచినవి.–నెలలు గడచినవి.– సంవత్సర ములు గతించినవి. ఆపిల్లకొఱ కెవ్వరును రాలేదు. రాఘవే శ్వరస్వామియే న న్నిట్లనుగ్రహించినాఁడని తలఁచితిని. వేశ్యల

మైన మాకు ఆడుపిల్ల దొరకుట వరదానమువంటిదేకదా ! పెంచి పోషించితిని. మాకులగురువులవద్దనే సంగీతాభినయ ముల నేర్పించుచున్నాను. నేనును పెద్దదాన నైతిని. నాకును వెనుకముం దెవరును లేరు. స్వామివారిమాన్య మున్నది. స్వామికొలువు చేయుచు నెవనినైన రసికావతంసుని చేపట్టి నచో నాకు దీనిబాధ్యత తీఱిపోవును. కాని, యెందఱు వచ్చినను వారితో సరిగ మాటాడనైన మాటాడదు. స్వామికొలువు నకు మాత్రము నిత్యము నేగును. సంగీతాభినయము లనిన దీనికి మిక్కిలి యభిమానము. దాని నొకదారికిఁ గొనివచ్చు భారము ప్రభువులు వహించి నన్నుద్ధరింపవలెను." అని విన్న వించుకొనినది.

దీక్షితుల కాయజ్ఞాతబాలికపై నొకవిధమైన కరుణ జనించెను.—"పాప మీబాలిక యేకులమునకుఁ జెందినదో గదా! ఆశిశువు నట్లు కని పారవేసిన పరమకిరాతి యెవర్తె కయో! బహుశః సమాజభీరువైన వితంతు వొనర్చిన దౌష్ట్యమై యుండనోపు! ఎవతెయైన నేమి? ఏకులమునకుఁ జెందిన నేమి? ఈవేశ్యమాతచే పోషితయై ప్రస్తుత మీమె యధీనమున నుంట నీమెయు వేశ్యయే యగును. ఇట్లేగదా వేశ్యలసంఖ్య యభివృద్ధియగుట! ఈపిల్లకంఠము మాధుర్య పూర్ణమైనది. స్పష్టమైన ఉచ్చారణ, సునిశితబుద్ధి, వినయ విధేయతలు స్పష్టమగుచున్నవి. నానేర్చిన సంగీత భగవత శాస్త్రము లీమెకు బోధించి శాస్త్రపరిరక్షణ మొనరింతును." ఇట్లు చింతించుచు దీక్షితు లింటి కేఁగిరి.

తదాది యాచిన్నది దీక్షితులవద్ద భరతగాంధర్వముల నభ్యసింపఁదొడఁగెను. ఆమెపాడజాలని రాగములు లేవు. ఆమె వలనగాని యభినయవిశేషము లేదు. దీక్షితులు తమ సంపూర్ణపాండిత్యము నామెయందు నిక్షేపించిరి. అదేలనో గాని యాయువతియందు వేశ్యాలక్షణములు కన్పట్టవు. ఆ పరిసరములందున్నను పరిసరప్రభావ మామెచిత్తమును కదల్పఁజాలకపోయెను. అనేకులు ప్రతిష్ఠితయువకు లామెను బొంద యత్నించి విఫలులైరి.

అనుదినమును సాయంసమయమున రాఘవేశ్వరస్వామి యాలయమున కేఁగి స్వామిని దర్శించివచ్చు టామెకలవాటు. ఆమె యాలయమున కేఁగునప్పుడు జనసముదాయ మామె సౌందర్యమును గాంచి మంత్రముగ్ధ మయ్యెడిది. ఆసౌందర్యమునకుఁదోడు నడకలో నొకవిధమైన ఠీవి యున్నది. ఆఠీవికి వన్నెఁదెచ్చినది భరతశాస్త్రము. కొంద ఱా సౌందర్యపూర్ణసృష్టిని దర్శించి తన్మయు లయ్యెడివారు. కొందఱు విఫలమనోరథు లామెను గేలిసేయుటయు గలదు. ఎఱ్ఱనిపట్టుపావడఁ ధరించి బంగరుజరీయంచులుగల వలిపె మొండు అంచలముగ సవరించుకొని, మౌక్తికములుకుట్టిన నల్లని పట్టురవికధరించి, పరిమితభూషణములఁదాల్చి వీథిలో నడచుచుండ యువకులదృష్టు లామెను తమకందినంతదూర మనుసరించుచుండెడివి. కాని యాపడతుక తలయెత్తి యెవరివైపునుఁ జూచియెఱుఁగదు.

దీక్షితులవద్ద సంగీతాభినయముల నభ్యసించుకాలముననే లొల్ల లక్ష్మీధరపండితులు దీక్షితులవద్ద కేతెంచుచుండెడివారు. వారును గొండపీటియాస్థాన విద్వాంసులే! వారిరువురును అద్వైతసిద్ధాంతములఁ జర్చించుకొనుచుండెడివారు. లక్ష్మీధరపండితుల దర్శనశాస్త్రపాండిత్యము విలాసిని నాకర్షించినది. దీక్షితులతోఁ దన మనోరథమును వెలిబుచ్చినది. వారు లక్ష్మీధరపండితులతోఁ జెప్పి కావ్యనాటకాలంకారశాస్త్రములను నేర్పించినారు. అటుపిమ్మట వేదాంతశాస్త్రము ప్రారంభించినది.

ఈమె దీక్షితులవద్ద విద్యాభ్యాస మొనర్చుకాలముననే యామెను బెంచిన వృద్ధవారాంగన పరలోకగతురాలైనది. భుక్తికి సరిపోవునంతటి మాన్యముమాత్రము విలాసినికి సంక్రమించినది. అద్దానిచే జీవికానిర్వాహ మొనరించుకొనుచు దీక్షితుల వద్ద నామె విద్య నార్జించుచుండెను. ఆవృద్ధమరణించుటతో విలాసిని భారము దీక్షితులపైఁ బడెను. వృద్ధ చనిపోవునపుఁ డామెను దీక్షితులకొప్పగించి కనులుమూసినది. దీక్షితు లామెకు విలాసినివిషయమున తాను బాధ్యతవహించి యామెయున్నతికిఁ బ్రయత్నింతునని మాట యిచ్చినారు. కాలము రెండుసంవత్సరములమేర నిర్గమించినది. అలసులైనమానవులు నిద్రించినను కాలముమాత్ర మాగదు. అది విధివిరామ మెఱుఁగనిది. ఆకాలమే విలాసినిలో నొక నూత్నపరివర్తనముఁ గొనివచ్చినది. పాపమామెకుఁ దనలోఁ గల్గుచున్న పరివర్తనముగోచరింపలేదు. తనహృదయమందలి పరివర్తనము బాహ్యప్రపంచమునందలి పరివర్తనము వలె ప్రత్యక్షముకాదు. మానవుఁడు ప్రపంచమునం

తదాది యాచిన్నది దీక్షితులవద్ద భరతగాంధర్వముల నభ్యసింపఁదొడగెను. ఆమెపాడజాలని రాగములు లేవు. ఆమె వలనగాని యభినయవిశేషము లేదు. దీక్షితులు తమ సంపూర్ణపాండిత్యము నామెయందు నిక్షేపించిరి. అదేలనో గాని యాయువతియందు వేశ్యాలక్షణములు కన్పట్టవు. ఆ పరిసరములం దున్నను పరిసరప్రభావ మామెచిత్తమును కదల్పఁజాలకపోయెను. అనేకులు ప్రతిష్ఠితయువకు లామెను బొంద యత్నించి విఫలులైరి.

అనుదినమును సాయంసమయమున రాఘవేశ్వరస్వామి యాలయమున కేఁగి స్వామిని దర్శించివచ్చు టామెకలవాటు. ఆమె యాలయమున కేఁగునప్పుడు జనసముదాయ మామె సౌందర్యమును గాంచి మంత్రముగ్ధ మయ్యెడిది. ఆసౌందర్యమునకుఁదోడు నడకలో నొకవిధమైన ఠీవి యున్నది. ఆఠీవికి వన్నెఁదెచ్చినది భరతశాస్త్రము. కొంద ఱా సౌందర్యపూర్ణసృష్టిని దర్శించి తన్మయు లయ్యెడివారు. కొందఱు విఫలమనోరథు లామెను గేలిసేయుటయు గలదు. ఎఱ్ఱనిపట్టుపావడఁ ధరించి బంగరుజరీయంచులుగల వలిపె మొందు అంచలముగ సవరించుకొని, మౌక్తికములుకుట్టిన నల్లని పట్టురవికధరించి, పరిమితభూషణములఁదాల్చి వీథిలో నడచుచుండ యువకులదృష్టు లామెను తమకందినంతదూర మనుసరించుచుండెడివి. కాని యాపడతుక తలయెత్తి యెవరినైనఁ జూచియెఱుఁగదు.

దీక్షితులవద్ద సంగీతాభినయముల నభ్యసించుకాలముననే లొల్ల లక్ష్మీధరపండితులు దీక్షితులవద్ద కేతెంచుచుండెడివారు. వారును గొండవీటియాస్థాన విద్వాంసులే! వారిరువురును అద్వైతసిద్ధాంతములఁ జర్చించుకొనుచుండెడివారు. లక్ష్మీధరపండితుల దర్శనశాస్త్రపాండిత్యము విలాసిని నాకర్షించినది. దీక్షితులతోఁ దన మనోరథమును వెలిబుచ్చినది. వారు లక్ష్మీధరపండితులతోఁ జెప్పి కావ్యనాటకాలంకారశాస్త్రములను నేర్పించినారు. అటుపిమ్మట వేదాంతశాస్త్రము ప్రారంభించినది.

ఈమె దీక్షితులవద్ద విద్యాభ్యాస మొనర్చుకాలముననే యామెను బెంచిన వృద్ధవారాంగన పరలోకగతురాలైనది. భుక్తికి సరిపోవునంతటి మాన్యముమాత్రము విలాసినికి సంక్రమించినది. అద్దానిచే జీవికానిర్వాహ మొనరించుకొనుచు దీక్షితులవద్ద నామె విద్య నార్జించుచుండెను. ఆవృద్ధమరణించుటతో విలాసిని భారము దీక్షితులపైఁ బడెను. వృద్ధ చనిపోవునపుడామెను దీక్షితులకొప్పగించి కనులుమూసినది. దీక్షితు లామెకు విలాసినివిషయమున తాను బాధ్యతవహించి యామెయున్నతికిఁ బ్రయత్నింతునని మాట యిచ్చినారు. కాలము రెండుసంవత్సరములమేర నిర్గమించినది. అలసులైనమానవులు నిద్రించినను కాలముమాత్ర మాగదు. అది విధివిరామ మెఱుఁగనిది. ఆకాలమే విలాసినిలో నొక నూత్నపరివర్తనముఁ గొనివచ్చినది. పాపమామెకుఁ దనలోఁ గల్గుచున్న పరివర్తనముగోచరింపలేదు. తనహృదయమందలి పరివర్తనము బాహ్యప్రపంచమునందలి పరివర్తనము వలె ప్రత్యక్షముకాదు. మానవుఁడు ప్రపంచమునం

దలిమార్పును గ్రహించును. తనలోనిమార్పును గ్రహింపఁజాలడు - ఇదియే మానవుని దయనీయస్థితి.

గోపమంత్రి పండితకవి— కవిపండితపోషకుఁడు. తన యాస్థానము లలితకళాక్రీడాక్షేత్రము కావలెనని యాతనిసంకల్పము. లక్ష్మీధర, లక్ష్మీనారాయణ పండితులు తనయాస్థానవిద్వాంసులు. దేశయామాత్యుఁడు తనయాస్థానమున నున్నాఁడు. ఇంకను ననేకులు కవిపండితప్రకాండు లున్నారు. ఇంకను నాతనికి, తృప్తి కలుగలేదు. ఒకనాఁడు సభలో పండితుల నుద్దేశించి యనినాఁడు— "విజయనగరసామ్రాజ్యము సరస్వతికిఁ బుట్టినిల్లు. లలితకళావిలాసరంగభూమి. ఆంధ్రభోజుల శీతలచ్ఛాయ జేరి కవిపండితగాయక విహంగములు కలకూజితగానము లొనర్చుచుండసామంతమండలమైనకొండవీఁడు వన్నెతఱిగియుండరాఁదు. మనయాస్థానము పండితాఖండలులకు నిలయముకావలెనని మా సంకల్పము. నాల్గుసంవత్సరములైనది. ఒక్కపండితుఁడు మనయాస్థానమునకుఁ గ్రొత్తగ రాలేదు. ఇయ్యది మాకు మిక్కిలివిచారమును కలిగించుచున్నది. ఏవిద్యయందైనను నారితేరిన పండితులున్నచో వారిని మనయాస్థానమున కాకర్షించుట మావిధి.

ఇది విని లక్ష్మీనారాయణపండితులు లేచి యభివాదనమాచరించి— "ప్రభూ! నా దొక్కమనవి. అట్టిపాండిత్యము గలవారు స్త్రీలందున్నచో వారికి సభాప్రవేశార్హత యుండునా?" యని యడిగెను.

"తప్పక! అట్టి విదుషీమణులే మనయాస్థానముననున్నచో మన గౌరవ మినుమడించును. ఎవరైన నున్నారా?"

" గాంధర్వభరతశాస్త్రప్రవీణ యొకర్తుక యున్నది."

" వేశ్యయా ? "

" కాదు... కాని... "

"మఱి? "

"జన్మమునుగుఱించిన వివరములు తెలియవు. కాని, వేశ్యచే పోషింపఁబడినది. రూపశీలములనే యాభిజాత్యలకునుఁ దీసిపోదు."

"ఆమెగురువులు? "

"లక్ష్మీధరపండితులు నేనును"

"ఇంకఁ గావలసినదేమి? మనయాస్థానమునకుఁ దప్పక గొనిరండు రేపే యామెవిద్యాప్రదర్శమున కేర్పాట్లు గావింపఁబడును."

ఆమఱునాఁడే విలాసినినృత్యప్రదర్శనము జరిగెను. గోపమంత్రి యాయభినయమునకు ముగ్ధుఁడయ్యెను. నిజముగ నా ప్రదర్శనమున భరతముని సాక్షాత్కరించినాఁడు. వేశ్యలయభినయము గోపమంత్రికిఁ గ్రొత్త కాదు. అనేకనృత్యప్రదర్శనములఁ దిలకించినాఁడు. కాని, యిట్టి శాస్త్రసమ్మతమైన నాట్యము నాతఁడితఃపూర్వము వీక్షించియుండలేదు. విలాసిని కొక రత్నాలహారము బహూకరించినాఁడు. ఆస్థానపండితగౌరవములఁ బ్రసాదించినాడు. విలాసిని సవిలాసముగ ప్రభువునకు నమస్కరించినది.

సభనుముగించి గోపమంత్రి నిజసౌధమునకు బయలు దేరెను. వెంట లక్ష్మీనారాయణపండితులును నేఁగిరి. సౌధద్వారమునద్దకు జేరిన తరువాత పండితులు గోపమంత్రితో— "ప్రభువులతో నేకాంతమున నొక్కమనవి" యనినారు.

ఇరువురును నేకాంతసదనమున కేఁగిరి. గోపమంత్రి యొక యాసనముపైఁ గూర్చుండెను. అద్దాని కెదురుగనున్న యాసనముపై పండితు లాసీనులైరి.

"విషయమేమి"? అనునట్లు గోపమంత్రి పండితులవంక చూచెను.

"విలాసిని విషయము."

"ఏమందురు?"

"ఆమె భవిష్యత్తును ప్రభువులు నిర్ణయింపవలెను."

"అస్థానపండిత గౌరవములఁ బ్రసాదించితిమిగదా!"

"ప్రభూ! ఆడుదానికి మడిమాన్యములతోఁ గడుపు నిండునా?"

"మఱి?"

"ప్రభువు లాగ్రహింపకున్నచో విన్నవింతును."

"భయములేదు."

"ప్రభువు లామెను భరింపవలెను."

గోపమంత్రి పక్కుననవ్వెను— "వివాహితుఁడను గదా!"

"ప్రభువులకు తప్పులేదు"

"బ్రాహ్మణుడనుగదా!"

"బ్రాహ్మణున కయ్యది ధర్మవిహితమే!"

"ఆమెజాతియే తెలియదుగదా! వివాహ మెట్లు?"

"వేశ్యయని సమాజ మనుచున్నదిగదా! వివాహ మన వసరము. ఆమెను వేశ్యగనే స్వీకరింపుడు. ఆమె శీలవతి. భర్త వలె మిమ్ము పూజించును. ప్రభువుల కీర్తికిఁ గొఱత కలుగదు."

గోపమంత్రి చిరునవ్వునవ్వెను.

తదాది విలాసిని గోపమంత్రికి పత్నీసమము. కాని, పత్ని కాదు, విలాసిని వేశ్యయే! కాని వేశ్యకాదు. వారిరువురిప్రణయ బంధము ఘనిష్టమైనది. విలాసిని గోపమంత్రియింటి కేఁగును. అతని భార్యను పూజించును. బిడ్డల నెత్తికొనును. ఒక పరి చారికవలె మెలఁగును. గోపమంత్రి తనవద్ద కేతెంచినపుడు మాత్రమే విలాసిని ప్రేయసీరూపమునఁ గాన్పించును. గోప మంత్రిభార్యయు నామెను గౌరవించును, ప్రేమించును. ఆమె కొఱ కంతఃపురసమీపమున నొక భవన మేర్పాటుగావింపఁ బడెను. ప్రభువులకుఁ బ్రియసియైనను నామె రాజసభలో నృత్య ప్రదర్శనము లిచ్చుచునే యుండును.

ఆ సంవత్సరమే శరన్నవరాత్రోత్సవమునకు గోపమంత్రి లక్ష్మీధర, లక్ష్మీనారాయణ పండితులతోఁగూడ విజయనగర మేఁగిరి. అచట కృష్ణరాయసార్వభౌము లియిరువురుపండితుల

శేముషీవైభవమును గాంచి ముగ్ధులై తమ యాస్థానమున నుంచుకొన సంకల్పించి గోపమంత్రికిఁ దమయభిలాషను వ్యక్తమొనరించిరి. అందులకు గోపమంత్రి- "ప్రభూ! కొండవీడు ప్రభువులది. కొండవీటిప్రజలు సామ్రాజ్యప్రజలు. కొండవీటి పండితులు మాత్రము సామ్రాజ్యాస్థానవిద్వాంసులు కారా? తమ యభిమతమే కానిండు. సామ్రాజ్యాస్థానవిద్వన్మండలికి, గొండవీడుగూడ నిరువురుపండితులఁ బంపగలిగినందులకు గర్వింపవలసినవిషయమే! ప్రభువులచిత్తము ననుసరించి యీ యిరువురు పండితులను దేవరయాస్థానమున నిలుపుకొనవచ్చును" అనెను.

అనంతరము సార్వభౌములయాజ్ఞఁ ననుసరించి యీ యిరువురుపండితులును గొండవీడు వీడి విజయనగరముఁ జేరిరి. సార్వభౌములు లక్ష్మీనారాయణ పండితుల నంతఃపురమున సంగీతాధ్యాపకులుగ నియమించిరి. లక్ష్మీధరపండితుల నాస్థాన పండిత గౌరవములతో సత్కరించిరి. వారు గడచిన రెండు సంవత్సరములందును కొండవీడు రాలేదు. విలాసినికిఁ దన గురుదేవులను దర్శింపవలెనను కోరిక యెక్కుడయ్యెను.

మరునాటి యుదయమునకు వినుకొండనుండి దేశయామాత్యుఁ డేతెంచెను. గోపమంత్రి తన యనుపస్థితియందు దుర్గరక్షణపాలనభారము లాతని కొప్పగించెను.

దేశయామాత్యుఁడు వినుకొండసీమకు నాయకుఁడు. అతని ధార్మికబుద్ధిని, కార్యనిర్వహణకౌశలమును గాంచి గోపమంత్రి కొండవీడు రాజ్యాంతర్గతములైన సీమలందలి యమరనాయకుల వద్దనుండి కప్పములు వసూలుచేయుటయు, లెక్కలఁ దయారు చేయుటయు దేశయామాత్యున కొప్పగించెను. గోపమంత్రి యా భారమును దేశయామాత్యునిపైఁ బెట్టుటకుఁ గారణము తాను సామ్రాజ్యమంత్రివర్గమునం దొక సభ్యుఁడగుటయుఁ దఱచుగ విజయనగరముననే యుండవలసివచ్చుచుండుటయే!'

దేశయామాత్యుఁడు సంప్రతులఁబిలిపించి వారిసాయమున నాయా సీమలనుండి వచ్చిన కప్పములను, ఇంకను నమరనాయకు లివ్వవలసియున్న సొమ్మును లెక్కజూచినాఁడు. ఆపిమ్మట గ్రామనాయకులవద్దనుండి పట్టినాయకులకు వసూలైన ధనమును, వా రమరనాయకులకుఁ జెల్లించిన పైకమును సరిచూచినాఁడు. అమరనాయకులు వసూలుచేసిన మొత్తము నాలుగుకోట్లవరహాలవఱకు నున్నది. కాని, వారు బొక్కసమున జమకట్టినసొమ్ము మూడుకోట్ల యేబదిలక్షలుమాత్రమే! ప్రధానసంప్రతునిఁ బిలిపించినాఁడు. కారణ మడిగినాఁడు. ప్రధానకరణికుఁడు అమరనాయకులు పంపుకొనిన విజ్ఞాపనములను చదివి వినిపించినాఁడు. వారు చైత్రోత్సవసమయమునకు మిగిలిన సొమ్ము చెల్లింతుమని వ్రాసినారు. దేశయామాత్యుఁడు వారి విజ్ఞాపనమును మన్నించి యనుమతించెను. పణములు తారలతో

సహా లెక్కలు సరిపోయినవి. పిమ్మట రాజకోశముననున్న నిలువ చూచినాడు. బొక్కసమున నారున్నరకోట్లవరహా లున్నవి. సామ్రాజ్యమునకుఁ జెల్లింపవలసినపైకము అయిదు కోట్లవరహాలు. ఆసొమ్మును ప్రత్యేకించినాఁడు.

పిమ్మట కోశాధిపతిని బిలిచినాఁడు. వెండి, బంగారము మున్నగులోహములనిలువఁ దెలిసికొనినాఁడు. "టంకసాలనుండి నాణెములు ముద్రింపవలసియుండునా? ప్రస్తుతమున్న నాణె ములు వాడుకకు సరిపోవుచున్నవా?" అని ప్రశ్నించెను. కోశాధి పతి పణములు తారలు తక్కువగనున్నవని విన్నవించెను. విజ యనగరము గొంపోయి వలసిన నాణెముల నచట టంకసాలలో ముద్రించుటకు గావలసిన వెండిని సిద్ధ మొనర్చెను.

ప్రతి సంవత్సరమును శరన్నవరాత్రోత్సవముల కేతెంచి నపుడు సామంతులందఱును తాముసామ్రాజ్యమునకుఁ జెల్లింప వలసిన కప్పమునుగొనివచ్చి యుత్సవమున బాల్గొని సార్వభౌము లకుఁగప్పము చెల్లించి, తమతమ విజ్ఞాపనముల నివేదించుకొనుట యనూనాచారము. ఏ యుద్ధముననో నిమగ్నుఁడైయున్నప్పుడు మాత్రమే సామంతమండలేశ్వరులకు, ఉత్సవమునకు రాజాల నందుల కనుమతి యొసంగబడును. ఇతరకారణములచే రాజా లకపోయినచోఁ బ్రతినిధినైనను బంపి కప్పము చెల్లింపవలెను. అట్లు జరుగనిచో సామండలేశ్వరుఁడు సామ్రాజ్యము నెడ వినయవిధేయతలు గోల్పోయినట్లు భావింపఁబడును. శరన్నవ

రాత్రిముల సమయమునఁ గప్పము చెల్లించుటకు వలసినంత ధనము మండలేశ్వరులవద్ద లేనిచోఁ గొంత చెల్లించి మిగిలినది శ్రీవిరూపాక్షస్వామివారి చైత్రోత్సవమున కేఁగునప్పుడు చెల్లించుటకు సార్వభౌములయనుమతిఁ బొందవలసియుండును.

గోపయామాత్యుల ప్రయాణసన్నాహములు పూర్తి యైనవి. అమరనాయకులును, పట్టియనాయకులును తమతమ యధీనముననున్న యశ్వబలముతో గోపమంత్రి ననుగమించిరి. గోపయామాత్యుఁడు సపరివారుఁడై విలాసినితోఁగూడ విజయ నగరమునకుఁ బయన మయ్యెను.



•

౧

తుంగభద్రాస్రవంతి యుత్తుంగశిలాఫలకముల నొరసి
కొని ప్రబలవేగమున కల్లోల మొనర్చుచున్నది. ప్రవాహ
మధ్యమున నున్న గండోపలములు శీర్షముల నీట ముంచి తన్మ
యములై జలకమాడుచున్న మదమాతంగముల ననుకరించు
చున్నవి. ఎటుచూచినను కొండబండలే! ఆకొండలనడుమ నీ
మహావేగస్రవంతి. భగవానుని సృష్టివిచిత్రము! ఆనదీవేగము
నకుఁ గొండబండలుసైతము నునుపెక్కినవి. మధ్యమధ్య నా
స్రవంతి యాపెనుబండల జుట్టి సుడులు తిరుగుచున్నది.

ఉషఃకాంత పూర్వదిశ నలంకరించినది. బాలభానుని
యరుణకిరణప్రసారముచే నానదీనీరము హోలికోత్సవవసంతప్రవా
హము ననుకరించినది. కొలదిసేపటిలో బంగరుకాంతుల నీని
నది. చక్రతీర్థపరిసరప్రదేశ మంతయు జనసముదాయముచే నిం
డియున్నది. ఆ నదీతీరమున నెటు జూచినను స్నానాగతజన
శ్రేణులే! భక్తులు పవిత్రనదీతోయములఁ బునీతులై కోదండ
రామస్వామిదర్శన మొనరించుకొనుచుండిరి. రక్షకభటు లప్ర
మత్తులై తీరమునఁ గావలి కాయుచుండిరి. ఆశ్వికులు కొందఱు
బారులుతీఱి చక్రతీర్థమున జనులను ప్రక్కకు సద్దుచుండిరి.

సార్వభౌములు వచ్చు వేళయైనది. ప్రతిదినమును సార్వ
భౌములు చక్రతీర్థమున కేతెంచి స్నాన మొనర్చు నాచారము
లేదు. ఆమహానుభావులకు లోటేమి? తుంగభద్రానీరమును

రాచనగరున బ్రవహింపఁజేసినారు. వీధివీధికిని తుంగభద్రాతోయ మును గొంపోయినారు. బ్రతియాలయమునకును తుంగభద్రానదీ మతల్లి ప్రదక్షిణ లొనరించినది. నేఁ డాశ్వయుజశుద్ధపాడ్యమి. శరన్నవరాత్రోత్సవములు విజయనగరప్రభువుల యాస్తికత కును, వైభవమునకును జిహ్నములు! నేఁడు మాత్రము సార్వ భౌములు చక్రతీర్థమున స్నాన మొనరించు టాచారము. నేఁడే కలశస్థాపనము- భేతాళపాణిప్రతిష్ఠయు జరుగును.

కొలఁదిసేపటి కొకవిధమైన కోలాహలము బయలు దేరెను. సైనికులు చక్రతీర్థపరిసరప్రదేశములం దున్న ప్రజ లను ప్రక్కకొత్తిగిలఁజేసిరి. రక్షకభటులు బారులుతీఱి దారు లేర్పఱచిరి. సార్వభౌములు భద్రగజముపై నంబారిలోఁ గూ ర్చుండి యేతెంచుచుండిరి. మంగళవాద్యములు మిన్నుముట్టు చుండెను. రాజగురువులైన శ్రీవ్యాసరాయలవారును, రాజ పురోహితులైన శ్రీగంగనాథ, బసవదీక్షితులును, ననేకులు భూసురులును సార్వభౌముల ననుసరించుచుండిరి.

శ్రీకృష్ణదేవరాయ సార్వభౌములు చక్రతీర్థమువద్ద కేతెంచి భద్రగజముపైనుండి దిగిరి. రంగనాథదీక్షితులు సార్వ భౌములచే మంత్రపూతస్నాన మొనరింపఁజేసిరి. వేదవిప్రుల యాశీర్వచనములును, వేదఘోషలును మిన్నుముట్టెను. సార్వ భౌములు రాజగురువులైన వ్యాసరాయలవారి యాశీస్సులంది వారిని సంభావించిరి. అనంతరము సమాగతవిప్రబృందమునకు యథోచితదానము లాచరించిరి. మఱల సపరివారులై రాచనగ రునకు బయలుదేరిరి.

రాజభవనములన్నియు చిత్రవిచిత్రాలంకరణములచే నలకాపురి నధిక్షేపించుచుండెను. ప్రతిభవనమును కంచుకిజన పరిరక్షితమై తన రాజసమును వెలిబుచ్చుచుండెను. రాజకీయోద్యోగులందఱును దమతమ కార్యములందు వ్యస్తులై యుండిరి. ఉత్సవమును సుసంపన్న మొనరించుభారమంతయు వారిపైననే యుండెను.

ఎనిమిదిగంటలు కావచ్చినది. ఉత్సవసభామంటపమునకుఁ బోవు వేళ యైనది. సార్వభౌముల యలంకరణము పూర్తి కావచ్చుచుండెను. ఒక సింహామధ్య నిలువుటద్దముఁ గొని నిలువఁబడినది. ఒక లతాతన్వి కరకమలముల సంపఁగినూనె సార్వభౌముల కేశములకు రాచినది. కిసలయాంగుళి యొకర్తుక దంతపుదువ్వెనతో దువ్వినది. ఇరువ్వురుసుదతీమణులాభరణములఁగొని నిలువఁబడిరి. అలంకరణవిద్యానిష్ణాతయైన ముదితయొకర్తుక ఆభరము లలంకరించినది. పచ్చలపదకమును, కెంపులుదాపిన హేమకంకణములను, రత్నాలబేసరులను నలంకరించినది. రత్నాంగుళీయకముఁ దొడిగినది. మూరురాయరగండపెండారము చరణమునకుఁ దొడిగినది. మేలిపసందునగిషీపనులు గల వలిప మొండు రాజలాంఛనముగ వెనుక జీరాడుచున్నది. రత్నస్థగితమైన విద్యానగర రాజమకుటము తన దివ్యదీధితుల విరజిమ్ముచున్నది.

రాజప్రాసాదమునకుముందు మహోన్నతమైన శ్వేతగజ మొండు నిలువబడియుండెను. అయ్యది యైరావతసన్నిభము. దానియొడలెల్ల తెల్లగనుండి యచ్చటచట బూడిదరంగుమచ్చ లుండెను. దంతములచివఱ రత్నస్థగితములైన బంగరుకొమ్ముక

ట్లుండెను. వజ్రములుదాపిన ఫాలపట్టిక వ్రేలాడుచుండెను. చెవులపై చిత్రవిచిత్రవర్ణచిత్రములు చిత్రింపబడియుండెను. నుదుట త్రిచూర్ణములు తీర్చిదిద్దబడెను. మూపున నొకమఖమల్ గుడ్డ పరువఁబడియుండి యద్దానిపై నొక పసిడిపూతయంబారి యుండెను. అం దొక నునుమెత్తని పట్టుపఱపుండెను.

మంగళవాద్యములు ప్రారంభమయ్యెను. వందిమాగధుల స్తోత్రములు వినవచ్చుచుండెను. వేత్రహస్తులు వెండిబెత్తములఁదాల్చి బరాబరు లొనర్చుచుండిరి. కంచుకీజన మప్రమత్తమై యథాస్థానముల నిలువఁబడియుండెను. ద్వారమువద్ద మన్నీలు సార్వభౌమునిరాకకై ప్రతీక్షించుచుండిరి.

ద్వారయవనిక తొలఁగినది. సార్వభౌములదృష్టి గజరాజముపైఁబడి పిమ్మట రాజగురువులపైఁ బడినది. అంగరక్షకులు వెంటరా సార్వభౌములు వారణరాజమును సమీపించిరి. పరిచారకులు వెండినిచ్చెన వేసిరి. శ్రీకృష్ణరాయలు పసిడియంబారియం దుపవిష్టులైరి. ఇరువైపుల మఱి రెండు గజములుండెను. అం దొకదానిపై వస్త్రాచ్ఛాదితమైన భేతాళవిగ్రహము, మఱియొకదానిపై పూజోపకరణములును, కలశోదకము నుండెను. సార్వభౌములకుముందు శ్వేతచ్ఛత్రములు సాగెను. మంగళతూర్యనాదములు మిన్నుముట్టుచుండ సార్వభౌములు పూజామంటపమునకు బయలుదేరిరి.

ఉత్సవమంటపప్రాంతమంతయు నుత్సవదర్శనోత్సుకసమాగతజనసముదాయముతో నిండియుండెను. జనులకోలా

హాలము మిన్నుముట్టుచుండెను. నేలయీనినట్లున్న యోజన సముదాయము ఏచటినుండి యేతెంచినది? వీరందరును విజయనగరవాసులేనా? కొందరుత్సవదర్శనాకాంక్షులై దూరదూరములనుండియు వచ్చియుందురు. ఏమైనను నాపరిజనసమూహము కనులపండువుగ నున్నది.

ఉత్సవమంటపమునకుం జుట్టును నొక మైలు చతురస్రముగనున్న సువిశాలసమప్రదేశము! ఆ ప్రదేశమునుచుట్టి యొక ప్రహరీగోడ! ఆ ప్రాకారమునకు రెండేద్వారములు. ఒకటి రాజాంతఃపురమునుండి వచ్చునది. రెండవది పురములోనుండి వచ్చునది. పురములోనుండి యీ ప్రాకారద్వారము వద్దకు రావలెనన్న మఱియొక ప్రాకారము నతిక్రమింపవలసియుండును. ఈ రెండు ప్రాకారద్వారములవద్దను సాయుధులైన భటులెల్లవేళల కాపుందురు. ద్వారరక్షకభటాధికారి యనుమతి లేనిదే పురజనులకు లోనికిం బ్రవేశము లేదు. రాజకీయోద్యోగులందఱును దమతమ యుద్యోగ చిహ్నములం దాల్చి నిరాటంకముగం బ్రవేశింపవచ్చును. నేం డా సమతలప్రదేశ మంతయు నిసుకవైచిన రాలని జనసమూహముతోం గిక్కిఱిసియున్నది.

ఆ మైదానమునకు మధ్యగ నిరువదియడుగులయెత్తున నొక శిలానిర్మితమైన వేదిక యున్నది. అద్దాని నెక్కుట కిరువైపుల గజతలాటములతో సోపానపంక్తు లమర్పంబడియుండెను. ఆ వారణరాజములు శిలానిర్మితములా! లేక సజీవములా! శిలానిర్మితములేయైనచో స్థావరములై యచటనే యుండవలెనే!

అయ్యవి శీఘ్రగమనోన్ముఖమైయున్నవి. ఎవటికో యూతొందఱ? వేదికనుగూడ మోసికొనిపోవునా? ధన్యుఁడవోయీ శిల్పీ!

ఆ శిలావేదిక బహువిశాలమైనది. అద్దానిపై దారుశిల్ప సర్వస్వములైన స్తంభములు నిలువఁబెట్టఁబడినవి. వాటి నాధారముగఁ గొని పైకప్పును కొయ్యతో నిర్మించి మంటపాకారముఁ దీర్చినారు. ఆ మంటపమునకుఁ జుట్టును నమూల్యములైన మఖమల్ గుడ్డలు వ్రేలాడుచుండెను. పైభాగమున మఖమల్ చాందినీ యమర్చఁబడినది. అచ్చటచ్చట దీపములుంచు గాజు కుప్పెలు రజతశృంఖలములకు వ్రేలాడుచుండెను.

నేలయంతయుఁ గాశ్మీర దేశపురత్నకంబళములచే నాచ్ఛాదితమై యుండెను. ఆ వేదిక తూర్పుపడమరలుగ వలుబదిగజముల పొడ వుండెను. అందు తూర్పుకొనను వేదికకుమధ్య నొక దారునిర్మితమైన గది యొండుండెను. అద్దాని ప్రాగ్భాగమున నొక యవనిక ప్రక్కకుఁ దొలగింపఁబడియుండెను. ఆగది యం దొక స్వర్ణవేదిక బహువిధమణిగణవిభాసితమై యొప్పుచుండెను. ఆ వేదికపై విజయనగరసామ్రాజ్యసింహాసనము తన దివ్యదీధితుల వెలుగొందుచుండెను. ఆ సింహాసనమునకుపైన నొక శ్వేతచ్ఛత్రము స్వర్ణదండముతో నమర్చబడియుండెను. నవరత్నశోభితమైన యీ స్వర్ణసింహాసనమునకుముం దొక రత్నస్థగితమైన స్వర్ణపాదపీఠిక యుండెను.

ఆ గదికి దక్షిణవామపార్శ్వములందు రెండుగదులు పట్టువస్త్రములచే నిర్మింపబడియుండెను. దక్షిణపార్శ్వమున

నున్న గదికి వ్రేలాడుచున్న పట్టువస్త్రములపై చిత్రవర్ణముల దారములతో ననేకచిత్రములఁ జిత్రించిరి. ఆగదియం దొక హేమపీఠిక యమర్పఁబడియుండెను. అద్దానికి నాల్గువైపుల మణి ఖచితహేమకంభముల నిలువఁబెట్టి మందిరమును నిర్మించిరి. ఆ హేమపీఠి కిరుప్రక్కల నగిషీచెక్కడములు గల రెండు దీప స్తంభము లుండెను.

వామపార్శ్వముననున్న గదిసైతము సమ్యగలంకృతమై యుండెను. అందు కొన్ని బాలాసనము లున్నవి. అందు రాజ బంధువులాసీనులై యుండిరి. అందే సార్వభౌములకు సమీప మున మహామాత్యులైన తిమ్మరుసునకును, రాజగురువులైన వ్యాసరాయలకును నున్నతాసనము లుండెను. సామ్రాజ్య సింహాసనమున కెదురుగ కొన్నిగజములమేర వదలి యిరుప్రక్క లను కొన్నియాసనములు బారులుదీఱి యుండెను. సామంత, మండలేశ్వరులకును, ఆస్థానపండితులకును, పురప్రముఖులకును నయ్యవి ప్రత్యేకింపఁబడినవి. సింహాసనమున కెదురుగ మంటప మున కవ్వలిచివఱ నర్ధచంద్రాకృతిగ దారునిర్మితమై రంగ భూమి యొకం డుండెను. అయ్యది చిత్రవిచిత్రములైన యువనిక లతో నొప్పారుచుండెను. అద్దాని కిరుప్రక్కల నంతఃపురకాంతా సముదాయమున కేర్పాట్లు గావింపఁబడి వస్త్రాచ్ఛాదితమై యుండెను.

ఉత్సవమంటపమంతయు మంత్రిసామంతదండనాథాదు లతో నిండియుండెను. మంటపమునకుఁ జుట్టును సాయుధులైన ఆశ్వికభటులు కా పుండిరి. వారికవ్వల నల్లంతదూరమున నుత్స

వముఁజూచుట కేతెంచిన జనుల కేర్పాట్లు గావింపఁబడెను. ఆ ప్రదేశమంతయు నెండ తగులకుండ వస్త్రములచే నాచ్ఛాదించిరి. జనులెల్లరు సార్వభౌమాగమనమునకై ప్రతీక్షించుచుండిరి.

ఇంతలో సార్వభౌమాగమన సూచకముగ రాచనగరు బురుజుపైనుండి యేడు శతఘ్నులాకసములోనికి ప్రేల్చబడినవి. జనులలో త్రొక్కిసలాట తెక్కువైనవి. రాజభటులు వారినందఱి శాంతింపఁ జేయుచుండిరి. తిమ్మరుసు సభాభవనమున కేతెంచి యచటి యేర్పాట్లన్నింటిని పరిశీలించెను. వేత్రహస్తులు బారులు తీరి దారులుతీసిరి. వందిమాగధులు కైవారములు ప్రారంభించిరి.

"జయజయ స్వస్తి, సమస్తసద్గుణస్తోమభద్ర, రణరంగ రామభద్ర, కల్యాణమహీపాలభాస్వర, కల్యాణపురపరాధీశ్వర, విజయచరిత సింహాసనాభాస్వర, విజయనగర సింహాసనాధీశ్వర ఘనచండవర్గబాధక, పెనుగొండదుర్గసాధక, మంద్రగిరిదుర్గ భాస్వర, చంద్రగిరిదుర్గ రాజ్యాధీశ్వర, శబ్దపరిశుద్ధపాలక, ఉద్దగిరి రాజ్యపాలక, చందనపాటి ఖడ్గనాయక, కొండవీటి దుర్గ నాయక, సాంద్రకీర్తినిరంతర, చంద్రగుప్తధరాంతర, విజయకరాయతనాయక, బిజాపురభయదాయక, దేవగిరిదుర్గసమాక్రాంతి ధీర, గౌతమీస్నానపావనాకార, శీలచండమృదుభాషణ, గోలకొండ పురదూషణ, వేల్లితచండవల్లభ, బెల్లముకొండవల్లభ, కొండపల్లిహారణ, చండకర ప్రతాపభరణ, వినుకొండపాలక,

ధాన్యకటక సంచాలక, పొట్టునూరి జయ స్తంభ సంస్థాపక, గిరిదుర్గవనదుర్గ జలదుర్గ స్థలదుర్గ చతురసీతి దుర్గసాధక, మూరురాయరగండ, అరివీరప్రచండ, సమస్త సామ్రాజ్య వశవర్తి, సాహిత్యసమరాంగణ చక్రవర్తి, రిపురాజ గోపికాపాల, శ్రీకృష్ణదేవరాయ భూపాల, విజయీభవ, దిగ్విజయీభవ!''

బారులుతీరిన వేత్రహస్తులనడుమనుండి సార్వభౌములు పరివారసమేతులై యేతెంచుచుండిరి. నలుబది యేబదిమంది సుందరీమణులు పూలపళ్ళెరములఁ గేలఁగొని సార్వభౌముల మార్గమునఁ జల్లుచుండిరి. భద్రగజాధిరాజ ముత్సవమంటప మును సమీపించినంతనే సమీపముననున్న అంగరక్షకుల చేదండగొని సార్వభౌములు బంగరు నరుదచప్పరమునుండి దిగిరి.

సుందరసుదతీమణులు మార్గముఁ జూపుచుండ మంటపము నధిరోహించిరి. వెంటనే సభ్యులెల్లరు గౌరవసూచకముగ లేచి నిలువఁబడిరి. రాజగురువులు శ్రీ వ్యాసరాయలవారును, రాజపురోహితులును, సార్వభౌములను పూజాగృహములోనికిఁ గొంపోయిరి. వారి వెనుకనే వస్త్రాచ్ఛాదితమైయున్న భేతాళ విగ్రహమును సేవకులు నరుదచప్పరములో నుంచి గొనివచ్చిరి. సార్వభౌములు దేవపీఠి కెదురుగనున్న స్వర్ణపీఠిపైఁ గూర్చుండిరి. రాజగురువుల యనుజ్ఞవడసి రాజపురోహితులు పూజాకలాపమున కుపక్రమించిరి, కలశస్థాపనము, భేతాళప్రాణప్రతిష్ఠయు నైనది. భేతాళవిగ్రహముపై నున్న వస్త్రాచ్ఛాదనము తొలిగింపఁబడినది. శాస్త్రోక్తవిధిని పూజావిధులు నిర్వర్తింపఁ

బడినవి. కర్పూరహారతులు వెలిగినవి. ఆ ప్రకాశమున నా స్వర్ణవిగ్రహము తళుక్కున మెఱిసినది. వజ్రములుదాపిన కిరీటము, పద్మరాగమణి నిర్మితమైన త్రిచూర్ణము, మరకత మాణిక్యవైడూర్యములు పొదగఁబడిన కవచము, హారములంజి ముత్యాలసరములమధ్యమధ్య గ్రుచ్చబడియున్న రవలు రత్నములు ప్రకాశమున దివ్యదీధితుల వెలుఁగొందినది. దర్శకులు భక్తిప్రపత్తులతోఁ గేలు మోడ్చిరి.

ఇంతలో సూావటీంద్రుడు ఐరావతము, విజయగరుడాద్రి, ధర్మరాజు, గండరమిండడు అను నాలుగు గజరాజముల ముస్తీదుచేసికొని వచ్చి యీ మంటపసోపానములవద్ద నిలువఁబెట్టిరి. ఆ నాలుగు గజములును సార్వభౌములగజశాలలోనున్న యేనుగులలో నెల్ల నుత్తమమైనవి. ఆ నాల్గును రాయుల కభిమానపాత్రములు. వాటి యలంకరణములు మిగిలిన వారణములకు లేవు. దంతములకుఁ బచ్చలుపొదిగిన బంగరుకొమ్ముకట్లు, నీలమణులమధ్య వజ్రములుదాపిన తలమాళిగలు, చెవులకు జాతిముత్తెపుసరులు, త్రిచూర్ణ రేఖావిలసితఫాలముల బంగరుగంటలు, వైడూర్యస్థగితములైన మెడ గొలుసులు, మూపున నును పట్టుపుట్టంపుపరుపులు సమర్చిరి. ఆగజరాజములు తొండములఁజాపి యీయుత్సవసభామంటపభారమును వహించుచున్న జాతియేనుగులను పరామర్శించుచున్నవి.

ఆగజరాజములకుఁ బ్రక్కనే ఫల్గునుఁడు, నకులుఁడు, శత్రుఘ్నుఁడు, విజయరాఘవుఁడు, పార్థసారథి, నలుఁడు మున్ను

గాంగల యవనాశ్వరాజములు పంక్తిగాడు నిలువఁబడి యుం డెను. కషాయవర్ణచిత్రితమైనజూలు, రత్నకాంతుల వెదజల్లు ఫాలపట్టికలు, వజ్రములుదాపి స్వర్ణపట్టిక కమర్చిన కాలిగజ్జెలు, దివ్యకాంతులసీను ఉరస్త్రవాలత్రములతోఁ గనుల కింపు నింపు చుండెను.

రాజపురోహితులు సార్వభౌములను వెంటగొని యా హయగజరాజములచెంత కేతెంచిరి. వారివెంటనే వివిధకుసుమ సంభరితములైన పళ్ళెరములఁగొని కొందఱుంచయాన లుండిరి. రాజపురోహితులు సమంత్రకముగ గులాబిపువ్వులతో నాయశ్వ ములను గజములను పూజించుచుండ సార్వభౌములును ప్రక్క నందిచ్చు పళ్ళెరములనుండి పుష్పములఁగొని పూజించిరి.

అనంతరము మఱల సార్వభౌములను దేవతామందిరము కడకుఁ గొంపోయిరి. ఆమందిరమున నొకమూల క్రిందకు మెట్లు న్నవి. సార్వభౌములా మెట్లవెంబడి క్రిందకుదిగిరి. అది యొక విశాలగృహమువోలె నుండెను. అందు బలిపశువులు బంధింపఁ బడియుండెను. ప్రభు వొక్క వేటున పురోహితులు మంత్రములు పఠింపుచుండ భేతాళునకు బలియొసంగిరి. వెంటనే బయట శత ఘ్నులు ప్రేల్చబడెను.

రాయలవారు పూజామందిరమునుండి బయట కేతెం చిరి. బ్రాహ్మణ సమూహము స్వస్తివాచనము ప్రారంభించెను. బ్రాహ్మణుల యాశీస్సులంది, భేతాళునకు నమస్కరించి ప్రభు వులు సామ్రాజ్య సింహాసనాసీను లైరి. వెంటనే రంగభూమికి

ముందున్న యవనిక తొలఁగెను. అందుండి నాట్యకత్తియ లొక్కొమ్మిడి నానాముఖములనుండి మరుని బాణములవోలె దూసికొనివచ్చిరి. వారి సభాప్రవేశభంగిమ యద్భుతరసోద్దీపకము. సభ్యులు దిగ్భ్రాంతులై విలోకించుచుండిరి. ఆ నాట్యకత్తియ లందఱును నిరువదియేండ్ల యువతులు. వినూత్నరత్నాభరణాలంకృతలు. చూపరులకా యువతులు కులుకులుమీఱు మారుసెలగోలలు! పల్కులకులుకు పూఁదీవియలు! సొలపుల నిచ్చు వెన్నెలసోగలు! వారు విభిన్ననృత్యభంగిమల బ్రదర్శించి కర్పూరహారతుల నివాళించిరి.

అనంతరము దూరప్రాంతములనుండి యేతెంచిన సామంతమండలాధిపు లొక్కరొక్కరె లేచి సార్వభౌములకు నమస్కరించి కానిపించుకొనిరి. రాయలు వారిని సాదరముగ వీక్షించి పలుకరించి సంభావించెను. గోపయామాత్యుఁడు లేచి సార్వభౌముల కభివాదన మాచరించెను. ప్రభువు లాతనిఁ గాంచి—
"గోపయామాత్యా? కొండవీటి మండలమునఁ బ్రజలెల్ల సుఖులే కదా!"

"చిత్తము! దేవరశ్రీ ప్రతాపమున! కొండవీటి ప్రజల కెట్టియిక్కట్లును లేవు."

"మీ యాస్థానమునుండి విద్వాంసులెవరైన వచ్చినారా?"

గోపయామాత్యుఁ డించుక సంశయించెను. సార్వభౌములు మఱల ప్రశ్నించిరి— "సంశయించుచున్నా రేల?"

గోపమంత్రి ధైర్యముఁ దెచ్చుకొనెను— "ప్రభూ! సంగీతభరతనాట్య విశారద యొకర్తుక వచ్చినది."

"పేరు?"

"విలాసిని."

ఈ పేరు వినినంతనే లక్ష్మీనారాయణ, లక్ష్మీధరపండితు లిరువురు నులికిపడిరి. సభలో నొకవిధమైన జిజ్ఞాస పొడసూపెను. ఈ విలాసిని యెవతె? భరతగాంధర్వవిశారదయా? వేశ్యయై యుండనోపు! ఈమె యీ శాస్త్రములందు విదుషీమణియా? లేక కేవలనర్తకియా? కేవలము నర్తకియైనచో నిబ్బంది లేదు. విదుషీమణియై రాజసభాగౌరవముల నాశించినచో నిదియొక విపరీతమే! నేటివఱ కిట్టి విపరీతము జరుగలేదు. రాజాస్థానమున విదుషీమణులు లేరు.

సంగీతవిద్వాంసులు మఱింత కలఁతఁజెందిరి. సహజ మాత్సర్యము వారిలోఁ బొడసూపెను. నూత్నవిద్వాంసులే తెంతురనిన వారి కొకవిధమైన అసూయ జనించును. రాజాస్థానమునఁ దమగౌరవమునకు లోటువాటిల్లుననియో, లేక వానితో వాదోపవాదములకు దిగవలసివచ్చుననియో వారి భయము. అందుచే వారు నవాగంతకులైన విద్వాంసులకు సభాప్రవేశమే లేకుండచేయుటకుఁ బ్రయత్నింతురు. ఈ విలాసినివిషయము వారికి ముందు తెలియదు. గోపమంత్రివెంటవచ్చుటచే సభాప్రవేశమున కామె కాటంకమేమి? వా రింతవఱకు నామెను చూడలేదు. కానియెట్లైనను నామెను సభలోనికి రానీయఁగూడ దనుకొనిరి. వారిలో గుసగుసలు ప్రారంభమైనవి.

సార్వభౌములు మందహాసము చెంగలింప — "మంత్రి వర్యా! అయిన నామె మనయాస్థానమున విద్వాంసుల యెదుట తన పాండిత్యమును ప్రదర్శించునా?"

"దేవర యనుమతించుచో"

సంగీతభరతాచార్యుల కిది పిడుగుపాటైనది. తమతో నాడుదానికి సభాగౌరవమా? సిగ్గుచేటు. సంగీతవిద్వాంసులొకరి మొగ మొకరు చూచుకొనఁ దొడగిరి. పిమ్మట వారందఱును నంతఃపురమున సంగీతశిక్షకులైన లక్ష్మీనారాయణపండితుల వైపుఁ జూచిరి. లక్ష్మీనారాయణపండితుల మోమున చిఱునగవుల వెన్నెలలు దోచినవి. పండితుల మోములు వెలవెలబోయినవి. సంగీతవిద్వాంసులు వ్యాసరాయలవైపుఁ జూచిరి. రాజగురువులు వారి కాతరదృష్టినిఁ జూచినారు. వారి యభిప్రాయమును గ్రహించినారు. ఆసనముపైనుండి లేచి- "ప్రభూ! ఇంతవఱకిట్టి చోద్యము మన యాస్థానమున సంభవింపలేదు. ఈమె వేశ్యయని వినికిడి—..." అని యింకేమియో చెప్పబోవుచుండ గోప మంత్రి లేచి సార్వభౌముల కభివాదన మాచరించెను. సార్వభౌములు గోపమంత్రిని మాటాడుట కనుమతించిరి.

అంత గోపమంత్రి — "రాజగురువులు తమవచనముల నుపసంహరించుకొనవలెను" అనెను.

వ్యాస:— "కారణము?"

"ఆమె వేశ్యకాదు."

"మఱి?"

"గోపమంత్రికి పేర్చియసి...... పత్నీసమము. అందఱు పండితులవోలె నామెయు పండితసమక్షమున తనవిద్యను ప్రదర్శించును. అప్పుడేగదా నేర్చినవిద్య సార్థకమగును? ఆమె సామాన్యవేశ్యవోలె నాడుటకు రాలేదు. ఆమె వేశ్యకాదు."

"వేశ్యకాదనుట కాధారము? ఆమె యేజాతికిఁ జెందినదియుఁ దెలియునా?"

"తెలియదు. తెలియనప్పుడు వేశ్యయనుటేల? వేశ్యచేఁ బోషింపబడ వచ్చును. కాని యంతమాత్రముననే వేశ్య యనుట ధర్మముకాదు. ఆమె శీలవతి."

"మీ దృష్టిలోఁ గావచ్చును. వేశ్యకు సభాగౌరవ మిచ్చినచో సమాజమున సదాచారము నశించును. నిందుకొలువున నాడుదానితో వాదోపవాదములు, శాస్త్రచర్చలు, పండితుల కవమానజనకములు కావచ్చును."

ఇంతలో సార్వభౌములకెదురుగా రంగభూమికిప్రక్కనున్న యవనికాభ్యంతరముననుండి యొక నారీమూర్తి సార్వభౌములయెదుటికే తెంచి యభివాదన మాచరించెను. ఆవచ్చుటయందును నభివాదనమునుగూడ నభినయశాస్త్రసమ్మతముగనే యుండెను. సభ్యులు చకితులైరి. ఆమెరూపవిలాసములకు సభయంతయు మంత్రముగ్ధమైనది. సార్వభౌములమోమున చిఱునగవు చెంగలించినది. మఱుక్షణముననే శారదాభ్రశకలములమాటునకేగిన చంద్రబింబము ననుకరించినది.

ఆమె యవతవదనయై "ప్రభువులు మాటాడుట కనుమతించవలెను." అనెను.

విలాసిని వ్యాసరాయలవైపు జూచినది— "రాజగురువులకు నమస్కారములు! వైష్ణవమతప్రతిష్ఠాపనాచార్యులకు నేను చెప్పునంతటిదానను కాను. కాని,నావిషయమైన వాదోపవాదములు చెలరేగుటచే మాటాడవలసివచ్చినది. ఏకారణమున నాడుది సభలోఁ దన పాండిత్య ప్రకర్షను బ్రకటింప నర్హురాలు కాకపోయెనో తెలిసికొనఁగోరుచున్నాను. ఔద్ధత్యమును క్షమింపుఁడు."

సభయంతయు నాశ్చర్యచకిత మయ్యెను. ఆమెలోని ఠీవి, ఆవైదుష్యము, ఆయంగభంగిమలు వ్యాసరాయల నాశ్చర్యచకితుల నొనర్చెను. అతని కామె ప్రశ్నకెట్టి సమాధానమొసంగవలెనో తోఁచలేదు. ఆలోచించను లేదు. వెంటనే యనినారు – 'ప్రపంచమునందలి యజ్ఞానమునకు నధర్మమునకు నాడుదియే కారణము. మానవుఁడామాయకు-మోహస్వరూపిణికి-అజ్ఞానమూర్తికి-దూరమున నుండుటమంచిది. రాజాస్థానములందట్టివారి కసలే ప్రవేశ ముండరాదు......' అని. ఇంకేమియో మాటాడబోయి వెంటనే యాగినారు.

విలాసినిమోమున హాసరేఖ విద్యుల్లేఖవలెఁ దోఁచినది – "అగుచో ప్రకృతిస్వరూపిణియు, మాయారూపిణియు నైన నాడుది త్యాజ్యయై, తత్ప్రకృతిభాగములైన రాజ్యములు, రాజగురుత్వములు నెట్లు పూజ్యములైనవో ద్వైతాద్వైతవిశిష్టాద్వైతపారంగతులైన రాజగురువులకే తెలియవలెను."

ఈసమాధానమునకు వ్యాసరాయలు నిలువెల్ల కంపించెను. ఈమాటలలో నొకవిధమైన వ్యంగ్య మాతనికిఁ దోఁచెను.

తాను మొదట మధ్వుఁడు. పిమ్మట యద్వైతవాది యైనాఁడు. ఆపిమ్మట వైష్ణవమతప్రతిష్ఠాపనాచార్యుఁడై రాజగురువైనాఁడు. ఆమెమాట లాతనిహృదయమును కలఁచెను. ఏయాడుదానితో వాదోపవాదములు కూడదనినాఁడో యామెతోఁ దానే వాదమునకుఁ దిగవలసివచ్చినది. సంగీతశాస్త్రమునకాదు - వేదాంతమున - సాంఘికశాస్త్రమున - ధర్మశాస్త్రమున.

సభ్యులకు వీరివాదము వినోదముగ నుండెను. సార్వభౌములు సైతము కుతూహలురైరి. ఒకరు రాజగురువులు! వేఱొకతె గోపయామాత్యుని ప్రేయసి.! ఒకరు సర్వసంగపరిత్యాగులు! మఱియొకతె భోగవిలాసములే పరమావధిగా నెంచు విలాసిని! ఒకరిదృష్టిలోఁ బ్రపంచము మిథ్య. మరొకరిదృష్టిలో సత్యము. ఒకరిదృష్టిలో స్త్రీ యజ్ఞానస్వరూపిణి! ఆమెదృష్టిలో మానవ మాత్రులే యజ్ఞానస్వరూపులు! విచిత్రమైన సంఘటనము.

వ్యాసరాయలముఖ మించుక గంభీరమయ్యెను- "మానవునకు శీలసాధనము ముఖ్యము. సాంఘికమర్యాదల నతిక్రమించుట ధర్మహానికి కారణము. సంఘమున సదాచారము నశించును. అందుచే మే మట్లంటిమి."

"పదునారువేలమంది మాయాస్వరూపిణులను దగ్గఱకుఁ జేర్చిన శ్రీకృష్ణభగవానుని సదాచారమునకు హానికల్గినదా? ఆయన మహాత్మ్యమునకు కొఱఁత వాటిల్లినదా? నిరత రాసలీలా విలాసుఁడైన శ్రీకృష్ణభగవానునిశీలమునకు లోటు వాటిల్లినదా?

అద్వైతవాదియైన కృష్ణునకు తాను జ్ఞానస్వరూపుఁడ ననియు, గోపిక లజ్ఞానస్వరూపిణు లనియు స్వపరభేదము లేదు. భౌతిక లింగభేదముల నతిక్రమింపజాలని అపరిపక్వమనస్కులకుమాత్రమే ఆడుది యజ్ఞానమూర్తివోలె భాసించి భయముగొల్పును. మహాత్ములు జాతిమతవర్ణభేదములకు, రూపగుణలింగభేదములకు నతీతులు. నేను వాదమున పండితుల నోడించుటకు రాలేదు. ఉత్సవము లైనంతనే నాస్వామితోఁ గొండవీఁ డేగుదును. నా వలన నీరాజాస్థానగౌరవమునకు భంగమువాటిల్లి, సంఘసదాచారమునకు లోటువాటిల్లుచో నేను నాప్రయత్నము నుపసంహరించుకొందును.''

విలాసిని వచనాఘాతములు రాజగురువులను కలఁచి వేసెను. తానొనర్చిన తప్పును తాను గ్రహించినాఁడు. అనవసరముగ పండితులపక్ష మవలంబించి యింతచర్చకుఁ గారణమైనాఁడు. ఆమెవాదనైపుణ్యమున కాతఁ డబ్బురపడెను. అతని లోని ప్రతిస్పర్థ తీవ్రమైనది. కాని పైకి వ్యక్తముకానీయ లేదు. సంయమముతోఁ బ్రసన్నగంభీరముద్రఁ దాల్చి—"నీవు సామాన్య వేశ్యవు కావని మేమీసంభాషణమున గ్రహించితిమి. సంతోషము. ఇఁక మేము చెప్పఁదగినది లేదు. సార్వభౌముల యనుమతిఁ బొంది నీవిద్యను ప్రదర్శింపవచ్చును'' అనినారు.

గోపమంత్రి మోమున హాసరేఖ లుదయించెను. లక్ష్మీనారాయణపండితులు బుజము లెగురవేసిరి. లక్ష్మీధరపండితులు ప్రసన్నముఖమునఁ దల పంకించిరి. విలాసిని సార్వభౌములకు నమస్కరించినది— ''ప్రభువులయానతి'' అనినది.

"మాకొలువున విద్యాప్రదర్శన మొనరించుట కెవరు వచ్చినను నాటంకము లేదు. స్త్రీపురుషవిభేదమే కాదు – జాతి మతవర్ణవిచక్షణమునుఁ బాటింపఁబడదు. రేపుసాయంకాలము నృత్యప్రదర్శనము జరుగును" అని సార్వభౌము లనుమతించిరి.

అప్పటికే పండ్రెండుగంటలు కావచ్చుచుండెను. సభ చాలింపఁ బడినది. సపరివారులై సార్వభౌములు రాజభవనమునకు బయలుదేరిరి. సార్వభౌములు వెడలినతరువాత సామంతమండలేశ్వరులును తమతమబసలకు బయలుదేరిరి. గోపమంత్రి విలాసినీసమేతుఁడై తన భవనమునకు బయలుదేరెను.

•

## ౨

గోపయామాత్యునకు విఠలాపురమున నొక స్వంతభవన మున్ డెను. అయ్యది రెండంతరువుల మేడ. ఆ సౌధములోని గదు లన్నియు సువిశాలములై, సముచితాసనాదికములచే సమ్యగలంకృతములై యుండెను. సౌధభిత్తికలపై పలువిధముల గాథలు చిత్రింపబడియుండెను. స్తంభములన్నియు శిల్పవిన్నాణమును ప్రకటించుచుండును. సౌధసింహద్వారమున కిరుప్రక్కల ద్వారపాలకులు కాపుందురు. విజయనగరమున నున్నప్పుడు గోపమంత్రి యాసౌధముననే యుండును. ఆసౌధమునకు ప్రక్కనే మఱియొక విశాలభవన ముండెను. అందు గోపయామాత్యుని సంప్రతికరణములు నితరోద్యోగులు నుందురు.

గోపయామాత్యుని స్వీయభవనము నానుకొని వెనుక నొక పెద్దతోట యుండెను. అందొక ప్రక్క పనసనారింజనిమ్మలు, వేరొకప్రక్క నేరేడు, మారేడు వెలగ రసాలము లున్నవి. ఆ యారామమునకు మధ్యభాగమున మాలతీ మాధవీ లతలం బెంచి యొక లతామండపమును నిర్మింపజేసిరి. ఆమండపమునకుం జుట్టును మల్లె, జాజి, విరజాజి తీవియ లల్లిబిల్లిగ నల్లుకొని యుండుటచే మంటపాంతర్భాగము విశదముగ కానరాకుండెను. మంటపమున కొకవైపున మాత్రము ద్వార ముండెను. ఆ మంటపమున కనతిదూరమున షట్కోణాకారముగ నిర్మింపబడిన

కేళకుళి యొండుండెను. తుంగభద్రానీరము ఱాతికాల్వలగుండ ప్రవహించి యాక్రీడాసరస్సును నింపుచుండును. ఆ సరస్సునకుఁ జుట్టును పలువిధములైన పూలమొక్క లుండెను. ఆసరోవరమధ్యభాగమున నొక చలువఱాతిదిమ్మ యుండెను. ఆ దిమ్మపై కేఁగుట కొకప్రక్కనుండి ఱాతిపలక లమర్పబడి యుండెను.

నిజభవనమున గోపమంత్రి యొకగదిలోఁ గూర్చుండి యుండెను. అతనిమనసు మిక్కిలి ప్రసన్నముగ నుండెను. గడచినదినమున విలాసిని సార్వభౌములసమక్షమునఁ బలికినపలుకు లాతనికిఁ జక్కిలి గింతలు వెట్టుచున్నవి. విలాసిని—తన ప్రేయసి—ఎంతచక్కగ మాటాడినది! రాజగురువుల నిరుత్తరుల గావించినది. తన వాక్చాతుర్యమున సభ్యుల మన్నన లంది రాజానుమతిని బొందినది. ఇఁక నేటి సాయంకాలము జరుగనున్న నృత్యప్రదర్శనమునగాని విలాసినీనృత్యవిలాసములు లోకమునకు గన్పట్టవు. అప్పుడుగాని విలాసిని కేవల వేశ్యకాదనువిషయము లోకమునకు విదితముకాదు. అప్పుడుగాని విలాసినినిబొందిన గోపమంత్రి యదృష్టము లోకమునకు వ్యక్తముకాదు. అప్పుడుగాని నాపై నించుక నలుకవహించియున్న నామేనమామలు ప్రసన్నులు కారు.

ఇంతలో విలాసిని భోజన మొనర్చి యాగదిలోని కేతెంచినది. గోపమంత్రి కెదురుగనున్న యాసనముపైఁ గూర్చుండి ప్రక్కనున్న తాంబూలకరండమునుండి యాకులఁదీసి చిలుకలు చుట్టి గోపమంత్రికందిచ్చుచుండెను. అతఁడాచిలుకలఁ గొనుచు

నా చిలుకలకొలికితో— "విలాసినీ! సభలోఁ బెద్దగందరగోళ మొనర్చితివే! రాజగురువులతోనా నీ వాదప్రతివాదములు?"

"రాజగురువు లనినమాటలు బాగున్నవా?"

"వా రేమనిరి? రాజాస్థానమర్యాదను తెల్పిరి. అంతియేగదా!"

"ఇతఃపూర్వము రాజాస్థానమున విదుషీమణులును కవయిత్రులును లేనిచో నితఃపరముగూడ నుండగూడదని నియమమా? ఆడు వా రేమి పాప మొనర్చిరి?"

"ఏమైనను నీ పంతము నెగ్గించుకొంటివిగదా! ఇఁక నేడు నృత్యప్రదర్శన మెట్లు రక్తిగట్టునో చూడవలసియున్నది."

"ఇందు పంత మేమున్నది?"

"కాని, రాజగురువులను తృణీకరింపకుము. అతఁడు మహావిద్వాంసుఁడనియు, మహిమాన్వితుఁడైన యోగియనియుఁ బ్రతీతి. ఆయన రాజాస్థానమున ననేకపర్యాయములు తన మహిమలఁ జూపెనట! సార్వభౌము లాయనయెడ సంతుష్టులై యొకపర్యాయము సింహాసనము నొసంగిరట! కాని వా రద్దానిని స్వీకరింపలేదు. 'యతులకు రాజ్యము లేల' యనినారు. అప్పాజీయే యాతనిమాట కెదురాడఁడు. రాజగురువుల నధిక్షేపించుచో రాయలకుఁ గోపము రావచ్చును. మనకీ గొడవలేల?

"రాజగురువులను తృణీకరించుతలఁపు నాకు లేదు. వారి మోమున నొక దివ్యతేజ మున్నమాట నిజమే! తరువాత నే నే

పశ్చాత్తాపపడితిని. వారియింటి కేఁగి క్షమాపణము వేడివత్తును"
అని యామె లేచినది.

గోపమంత్రి మందహాస మొనరించెను— 'ఎచటికి ?
అతని కిల్లు లేదు. సంసారము లేదు. తుంగభద్రానదీతీరమున
నొక యుపవనమున చిన్న యాశ్రమ మున్నది. వా రచటనే
యుందురు. నలుగురైదుగురు ముఖ్యశిష్యులుమాత్రము వారి
వద్ద నుందురు.'

విలాసిని కాతనిఁజూచి సంభాషింపవలెనను బుద్ధి పొడ
సూపినది. శకటమెక్కి బయలుదేరినది. కొంతసేపటికి శకట
చోదకుఁడా యుపవన ముఖద్వారమున శకటము నాపినాఁడు.
వ్యాసరాయల శిష్యుఁ డొకఁడు ద్వారమువద్ద కేతెంచెను.
విలాసిని యాతనిని 'గురువు లున్నారా ?' యని ప్రశ్నించెను.
అతఁడు- 'స్వాము లున్నారు. లోనికి రండు' అనుచు నామెను
లోనికిఁ గొంపోయెను. వ్యాసయోగీంద్రు లొక దర్భాసన
ముపైఁ గూర్చుండి యేదియో వ్రాయుచుండిరి.

విలాసిని గదిలోని కేఁగి— "రాజగురువులకు నమస్కా
రము !" అనెను. వ్యాసరాయులు తల పైకెత్తి చూచెను.
ఆమెమాటలం దొకవిధమైన లాలిత్యముతోఁగూడిన మోహా
కత్వమున్నను రాజగురువుల కం దొకవిధమైన వ్యంగ్య మాభా
సించెను. అయ్యది యాతని హృదయస్థితివలన కలిగినది. ఇం
తలో శిష్యుఁడొకఁడు మఱియొక దర్భాసనమును గొనివచ్చెను.
వ్యాసరాయలవారు— "ఆశ్రమమున నున్న తాసనములు

లేవు. కష్టమనుకొనక దానిపై గూర్చుండుము'' అనిరి.

''పరవాలేదు. ఆశ్రమవాతావరణమున నిట్టివియే శోభించును. ఇక నా కష్టమందురా? స్వాములదర్శనమున కేతెంచినదాననుగాని ఆసనాదులకై రాలేదుగదా! తమదర్శనభాగ్యమే సమస్త సంతాపనివారకము!''

"మహామండలేశ్వరుల ప్రేమపాత్రురాలవైన నీకు పరివ్రాజకులమైన మా వలనఁ గాదగు పనియేమి?"

''తమ యమృతోపదేశముల నాశించితిని.''

"మహాభోగ సంపన్నురాలవైన నీకు మా వైరాగ్యబోధలేల?'' స్వాముల మోమున నొక హాసాభాస పొడసూపెను.

''ఎన్ని భోగము లనుభవించినను జీవితమునకు మృత్యువే గదా పరమావధి? భోగులనుసైతము పరలోకచింత పీడించుచునే యుండునుగదా!"

"అంతటి గాఢజిజ్ఞాసయే యున్నచో మనసు భోగముల వైపేల ఆకర్షింపఁబడును?"

"అదియే బోధపడకున్నది. ఎంత ప్రయత్నించినను మనసు నరికట్ట జాలకున్నాను. ఇయ్యది వయోదోషమేమో! వయసు మళ్ళినతరువాత మనసున కంతటిశక్తి యుండదేమో!"

"అయ్యాదిభ్రమ ! వయసువచ్చినను ఆనాఁడు మనసునకు వేరువిషయములు లభించును. దారపుత్రాదులపై మోహా మినుమడించును."

"యౌవనమున లౌకిక ప్రేమ భోగులైనవారు వార్ధకమున యోగు లగుదురుగదా !"

వ్యాసయోగీంద్రులమనసు చివుక్కుమన్నది. ఆమాట యాతనికి శూలమువలె నున్నది. తన పూర్వజీవితము మెఱపు వలెఁ దోచినది. ముఖ మొక్కక్షణము మ్లానమైనది. మఱల తేరుకొని—"అవును. మానవుని యందలి రాగాత్మికావృత్తియే భగవద్భక్తికి కారణము. ఆ వృత్తియే యౌవనమున లౌకిక ప్రేమకు కారణ మగును. అందువలననే రాగులు తేలికగ విరాగు లగుదురు."

విలాసినికి యోగీంద్రులవచనములు నచ్చినవి. వారి దృష్టియందు భోగములు తుచ్ఛములుకావు. చేతులుజోడించి నది— "స్వాములు న న్ననుగ్రహింపవలెను. నన్ను శిష్యగఁ బరిగ్రహింపవలెను.

స్వాము లులికిపడిరి— "అది మావలనకాదు. మే మెల్ల ప్పుడును స్త్రీలకు దూరముగ నుందుము. స్త్రీలవలన నాశ్రమ వాతావరణమే కలుషిత మగును."

"అగుచో స్వాములకుఁ దమ యాత్మనిగ్రహముపై విశ్వాస మింకను గుదురుకొనలేదన్నమాట !"

ఈబలమైన యాఘాతమునకు రాజగురువులు చకితులైరి. తమ మానసికోద్వేగమును వ్యక్తముకానీయక— "మా విష

యము కాదు. అపరిపక్వమనస్కులైన శిష్యులున్నారు. నీవును..." వారి నోటినుండి యింకేమియు వెలువడలేదు.

"నావిషయమున తమకెట్టి యనుమానమును వలదు."

"పరీక్షింపవలెను. నీ జిజ్ఞాస యెంతటి బలీయమైనదో చూడవలసి యున్నది. కాని..."

"సందేహమేల ?"

"మఱి గోపమంత్రి ?"

"వారి యంగీకారమా ? ఒక మానవుని వ్యక్తిత్వమును ఆత్మోన్నతిని అడ్డుటకు మఱియొకని కధికారము లేదుగదా! నా యాత్మోన్నతికై నేను ప్రయత్నించుకొందును."

"అతఁడు నిన్ను విడువఁజాలునా ?"

"అయ్యది వారి హృదయదౌర్బల్యము! దానికి నేను కారణమనుకానుగదా ! వారి యున్నతికి నే నడ్డుపడుదునా ?"

వ్యాసరాయల ముఖమున చిరునగవు రేఖామాత్రముగఁ దోఁచెను. ఆయన మనసులో ననేకవిధములైన ఆలోచనలు పొడ సూపినవి— "ఆహా! ప్రపంచము! గోపమంత్రిపై నీమెకు నిజముగ ప్రేమ సన్నగిలినదా ? అసలు ప్రేమయే లేదేమో! గడచినదంతయు నటనయేమో! ఈమెకింతటి వైరాగ్యము కలుగుటకుఁ గారణమేమి ? నిజముగ జీవితముపై - భౌతికభోగములపై విరాగము జనించెనా? అతిశయ భోగములు గూడ నతిశయ దుఃఖములవోలె వైరాగ్యజనకములేమో!

ఈమె మాటలు నిజములా ? లేక నన్ను పరీక్షించుటకా? ఈమె సాంగత్యమున నేను నామనస్స్థైర్యమును నిలుపుకొన గలుగుదునా ?" అనుమానము కలిగినది. మఱల ఆత్మాభిమానము పొడసూపినది— "ఈ మాత్రమునకే భయపడినచో నిఁక నా సాధనయేల ? అనుకొని— "విలాసినీ ! నీవు కోరినట్లు దీక్షయిత్తును. రేపే దీక్ష ప్రారంభము. నీ వేమాత్రము చ్యుతురాలవైనను అధఃపతనమే ! యోగభ్రష్టునకు వేఱుగతి లేదు. జాగ్రత్తగ నాలోచించుకొనుము." అనినారు.

"స్వామీ ! దీక్ష గైకొనక తప్పదు. స్వాము లనుగ్రహింపవలెను."

"సరే! రేపురమ్ము! కొన్ని ప్రాథమికవిషయములు బోధింతును."

'చిత్తము' అని విలాసిని రాజగురువులకు నమస్కరించి బయలు దేరినది.

విలాసిని వెళ్ళినప్పటినుండియు గోపమంత్రి కొంచె ముద్విగ్నుఁడైయుండెను. విలాసినికిఁ గొంచెము తొందరయెక్కువ. రాజగురువులవద్ద నెట్లు మాటాడునో! అతడు సామాన్యుఁడు కాఁడు. అతఁడు గొప్ప మహిమాన్వితుఁడని ప్రతీతి. రాజసమ్మానముఁ బడయగోరి వచ్చినది. రాజకోపభాజన మగునేమో !

విలాసినియనిన గోపమంత్రికి అభిమానము మెండు. ఆమె స్వాతంత్ర్యము నరికట్టడు— ఆమె నేమియుననడు. తాను పెండ్లియాడిన భార్య కాదని యాతఁ డెఱుఁగును. లోకము

దృష్టిలో నామె వేశ్యయే! కాని, యామెశీలమునెఱిగిన గోప మంత్రిదృష్టిలో వేశ్యకాదు. ఆమె వేశ్యయగునా కాదా యను వివాద మాతని కనవసరము. ఆమె శృంగారరసాధిదేవత! సంగీతభరతములచే మోడులఁ జిగురు లెత్తింపగలదు. తన హావభావవిలాసాదులచే నీరసకాష్ఠములందుసైతము రసస్రోతస్వినినిఁ బ్రవహింపఁజేయగలదు. విరాగినిసైతము రాగినొనర్చు సామర్థ్యమామెచూపులో నున్నది. ఆమెచూపుకోపు లినుపకచ్చడములు గట్టిన తాపసులకాలిబందము లగుటలో సందియములేదు. ఆ శృంగారరసాధిదేవతాస్వరూపిణియైన విలాసిని మానసికస్వాతంత్ర్యము నరికట్టుట గోపమంత్రి కిష్టములేదు. తనస్వేచ్ఛమెయి వనమున గ్రుమ్మరునప్పుడే హరిణసౌందర్యముచిత్తాకర్షకము! బంధమున బంధించినపు డాసహజసౌందర్య ముండదు. అట్లే విలాసినిస్వేచ్ఛకును, స్వాతంత్ర్యమునకును నడ్డులేకుండినంత వఱకును నామె విలాసినియే! ఆస్వాతంత్ర్యము నరికట్టినచో నిఁక విలాసమే లేదు. ఆమెయైనను నమాయికకాదుగదా! నియంత్రణ మావశ్యక మగుటకు! అందుచే స్వేచ్ఛమెయి సంచరించు విలాసినీచేష్టలు గోపమంత్రికి చక్కలిగింతలు. అతఁ డామె నేమియు ననఁడు. అట్లని యామె యాతనిని ధిక్కరింపదు. ప్రాణాధికముగ మన్నించును, గౌరవించును, పూజించును. ఆమెహృదయము సర్వదా గోపమంత్రికిఁ బ్రత్యక్షమే! ఆమె హృదయమున నెల్లప్పుడును గోపమంత్రిరూపమును బ్రత్యక్షమే!

విలాసిని యింటి కేతెంచినది. "ఏమొనర్చుకొనివచ్చితివి ? కయ్యము గొనిరాలేదుగదా!" అని చిఱునగవుతో ననినాఁడు గోపమంత్రి.

విలాసిని యించుక పేరలుకను ప్రదర్శించి – 'విలాసిని బయటకేఁగి మఱల సవ్యముగఁ దిరిగివచ్చునంతవఱకును ప్రభువులకు నమ్మకము లే దన్నమాట! పోనిండు! రాజగురువులతోఁ గయ్యమా! రాజగురువులకు శిష్యురాలనైతిని! ఇఁకనుండి వారు విలాసినికిఁగూడ గురువులే! వారిమాట కెదురాడుటా? అని ముక్కుపై వ్రేలిడి మరుక్షణముననే మందహాస మొనర్చెను.

"అదేమి? నీకు గురువులా?"

"స్వాములు నాకు దీక్ష నిత్తుననినారు. నేటిరాత్రికే ప్రారంభము!'' విలాసిని నవ్వు నాపుకొనలేకపోయినది.

''నేటిరాత్రికా? ఏమిటీమాటలు!''

''నిజమే! తరుణోపాయముఁ జూపింతు మనినారు. నాకీభోగములపై విరక్తి కలిగినది. ఛీ! ఈసంసారము! ఈ పుటుక! ఈజన్మము బుద్బుదప్రాయము!'' ఆమె విరాగము నభినయించెను. విలాసినిమోమున విరాగరేఖలు గోపమంత్రికి పులకరింతలకుఁ గారణమైనవి. గోపమంత్రి పకాలున నవ్వెను –

''భేష్! బాగున్నది! ఏదియో భూమికను రచించుచున్నావన్నమాట! నీవు సామాన్యురాలవా?''

విలాసిని నవ్వుచు ప్రక్కగదిలోని కేఁగినది. కొలఁదిసేపటికి బయటకు వచ్చినది. సమస్తాభరణభూషితయై రతీదేవివోలె

నున్నది. గోపమంత్రి యనిమేషపిపాసితదృక్కులతో నా మధుర మోహనముగ్ధవిలాసినీవిలాసమును జూచినాఁడు. ఎంతటి సంయమియైనను నీమె సౌందర్యమునకు దాసుఁడు కావలసినవాఁడే యని యనుకొనినాఁడు. రాజగురువు లీమెకు దీక్ష నొసంగబోయి యీామెచేతనే దీక్షితు లగుదురేమో!

విలాసిని రాజాస్థానమున కేఁగుటకు వేళయైనదని హెచ్చరించినది. అప్పటికే మూఁడుగంట లైనది. వారు శీఘ్రముగ బయలుదేరిరి. వారు సభామంటపమునకు చేరునప్పటికే సభయంతయు నిండియుండెను. గోపమంత్రి తన యాసనమువద్ద కేఁగెను. విలాసిని రంగభూమిలోని కేఁగినది.

వందిమాగధులకై వారములైనవి. సార్వభౌముల భద్రగజము వేదికవద్ద నాగెను. పార్శ్వరక్షకులచే దండగొని సార్వభౌములు భద్రగజమునుండి దిగిరి. ప్రధానామాత్యులైన తిమ్మరుసు సార్వభౌములకు స్వాగత మిచ్చెను. నలువురు సుదతీమణులు స్వర్ణకలశముల జలముఁ గొనివచ్చి సార్వభౌముల పాదప్రక్షాళన మొనరించి తడియొత్తిరి. ప్రభువులు వేదికపైకి యేతెంచినంతనే గౌరవసూచకముగ సభ్యులు లేచి నిలువఁబడిరి, సార్వభౌములు సింహాసనాసీను లైనంతనే, రాజబంధువులును, రాయబారులును, మంత్రులును సామంతులును క్రమముగ నాసీనులైరి. మహామాత్యులైన తిమ్మరుసునకు, రాజగురువులకును సార్వభౌముల సమీపముననే యున్నతాసనములుండెను.

సార్వభౌములు తెల్లని జరీయంచు పట్టునోవతియు, బంగరు గులాబిపూలుగల తెల్లని పట్టుకూర్పాసమును దొడిగి బవిరిచెక్కడపుఁ బచ్చలపదకమును, తళుకులీను వజ్రంపుటుత్తరి గెను, ముత్తియంపుచేసరులను దాల్చియుండిరి. మణికట్టులఁ గెంపులు దాపిన మెఱపుకడియము లుండెను. నవరత్నఖచితము లైన కేయూరములును, రత్నాంగుళీయకములును బ్రకాశించు చుండెను. శిరమున నవరత్నఖచితమైన సామ్రాజ్యమకుటము శోభించుచుండెను. పాదమున మూరురాయరగండపెండారపు మణిమరీచికాజాలములు సామంతులశిరోభాగమునకు వెదజల్ల బడుచున్నట్లుండెను.

అనంతరము ప్రధానామాత్యులు సార్వభౌములయాజ్ఞను సభాసదుల కెఱుకపఱచిరి— "పూర్వ నిర్ణయానుసారము కొండవీటి యాస్థానమునుండి యేతెంచిన భరతగాంధర్వ విద్యాప్రవీణ యొకర్తుక తన యభినయమునుఁ బ్రదర్శించును."

సభయంతయు నిశ్శబ్దముగ నుండెను. సభ్యులదృష్టులు నాట్యరంగమువైపునకు మఱలినవి. యవనిక యపసరింపఁ బడినది. సాంబ్రాణియగరుధూపములు చిఱుమబ్బులవోలె సుడులు తిరిగిరినవి. ఆ మబ్బుల చాటునుంటి చందురునివోలె విలాసినిమోము భాసించినది. వీణ, మురళి, తంబుర, గట్టి తాళము మున్నగు వాద్యములు మ్రోగినవి. ఆమె పసుపు పచ్చని చీరె ధరించి, బంగరు జరీచుక్కలుగల కంచుకము దొడి గినది. ఆమె యొకయడుగుముందునకు వేసినది. ఆమె యాభ

రణముల ప్రోతలో, కాలియందియలధ్వనిలో నొక విచిత్ర మైన సంగీత మున్నది. వాతావరణమంతయు మాదకసౌందర్య పరాగవికంపితమై పోయినది. ఉషఃకాలపు కనుచీకటిని చీల్చుకొని సూర్యునియరుణకిరణప్రసారమువలె నాయగరుధూప ములనుండి యీావలి కేతెంచినది. మాదకసౌరభముతో సభా భవనము గుమాళించినది.

మృదంగధ్వని ననుసరించిన దామె పదవిన్యాసము. అడుగులు వేయుచు, హస్తాభినయములఁ బ్రదర్శించుచు నామెముందునకువచ్చి సార్వభౌములకు నమస్కరించినది. ఆమె సౌందర్యమున నొకవిధమైన అపూర్వాకర్షణ మున్నది. ఆమె జడలో ముడిచిన పూలు చంద్రుని విపత్తునుండి రక్షించుటకై నక్షత్రములన్నియు గలిసి నల్లత్రాచుతోఁ గలియఁబడిన ట్లుండెను. సార్వభౌములకు నమస్కరించిన పిమ్మట నామె రాజగురువులకును, మహామాత్యులకును, గోపమంత్రికిని నంజలిఘటించి మందహాసముతో సభ్యులను పరామర్శించినది.

కల్యాణినందుకొనినది వీణియ. ఆమె సుందరసుకోమల చరణమంజీరములు తాళము వేసినవి. నృత్యమారంభమైనది. ఆమె చౌపదనవపదములను, పేరణి, జక్కిణి మున్నగు నృత్య భంగిమములఁ బ్రదర్శించినది. పేరణినభినయించునప్పుడు సభ్యు లద్భుతరస నిమగ్నులైరి. క్రిందనున్న భాండముపైసైత మామె చరణముల కాధారముగనున్నట్లు సభ్యులకుఁ దోచలేదు. ఆమె యాకసమున నభినయించుచున్న ట్లుండెను. సార్వభౌములు

తన్మయులైరి. వారి మనమునను న్న చింతాభరము తొలగినది. నృత్యము సమాప్తమైనది. సభ్యులు కరతాళము లొనర్చిరి. మరుక్షణమున నే సార్వభౌముల మోమున నొక విషాద రేఖ పొడ సూపెను. అయ్యది పూర్వవాసనాభాసవోలెఁ దోచినది. వెంటనే ప్రబుద్ధులైరి. విలాసిని సార్వభౌములకు వందన మాచరించినది. సుదతీమణు లిరువురు రాజాజ్ఞ ననుసరించి బహువిధ భూషణములచే నిండిన రెండు పళ్ళెరములఁగొని సార్వభౌముల వద్ద కేతెంచిరి. విలాసిని సార్వభౌములను సమీపించినది. ప్రభువు లామెను జూచినారు. వారిహృదయమం దొక యజ్ఞాతవేదన యిమిడియున్న ట్లామె కనిపెట్టినది. ఒక్క యడుగు వెనుకకు వేసినది. ప్రభువులు మఱల ప్రబుద్ధులై ప్రసన్న ముఖముతో రత్నాభరణములను, కస్తూరి, జవ్వాది, పునుగు, హరిచందనాది సుగంధద్రవ్యములను బహువిధకుసుమములతో నామె కొసంగిరి. విలాసిని యాపళ్ళెరముల నందుకొని ప్రభువునకు నమస్కరించినది. సభలోఁ గరతాళధ్వనులు చెలరేగెను.

అప్పటికే సాయంకాల మూరుగంటలు దాటినది. ప్రభువులయాజ్ఞ ననుసరించి నాటికొలువు చాలింపఁబడినది. సార్వభౌములు పురోహితులతో గూడ పూజామందిరమున కేగిరి. అచట సాయంకాలపూజలు నిర్వర్తించుకొని నిజభవనమునకు బయలుదేరిరి. మూడు వందలమంది కంచుకీజనము సార్వభౌముల ననుగమించెను.

ఈ నవరాత్రోత్సవసమయమున సార్వభౌములు నక్తము లుందురు. స్నానాదికముల నిర్వర్తించుకొని ప్రభువులు భోజన

మున కేఁగిరి. ప్రభువులకు భోజనశాలయందు దొంతర కుందనపు పీఠము నమర్చిరి. మగరాలనిగరాల జిగిదేరుచు బంగరుసింగపుకోళ్ళతో నొప్పుచున్న యడ్డిగమీఁద పేరోదనపు పసిడి పళ్ళెర ముంచిరి. చుట్టును పలువిధములైన బంగరుగిన్నెలున్నవి. శాల్యోదనము, సద్యోఘృతము శాకపుఁగూరలు, చూర్ణములు, పాయసము, వివిధభక్ష్యములును వడ్డించిరి. సార్వభౌములకు భోజనము రుచింపలేదు. వంటకత్తియలు శాకపాకములు రుచింపలేదేమో యని సభయనేత్రలైరి. వడ్డనలోఁ బొరపాటు జరిగెనేమోయని వడ్డించిన సుందరాంగులు కలఁతజెందిరి. సార్వభౌములకి గొడవయేలేదు. పరిచారికలు మార్గముఁజూప శయనగృహమున తల్పముపై విశ్రమించినారు. శీతాంశువదన లిరువురు చామరములఁ జేబూని వీచుచుండిరి. పరిచారిక లుపచారము లొనర్చుచుండిరి. ఎంతప్రయత్నించినను ప్రభువులకు నిద్రపట్టుటలేదు. వారిమనోవీథిని విలాసిని సాక్షాత్కరించినది. మానిన మానసికమైన గాయము మఱల రేగినట్లయినది. ఈమెవతె? వేశ్యయనినారే! ఈమె యజ్ఞాత జన్మమునకుఁ గారణమేమి? సార్వభౌము లిట్లాలోచించుచునే యుండిరి. ఉపవాసక్లేశమున కునుకుపట్టినది.

విలాసిని గోపమంత్రితోఁగూడ ఇంటికి వచ్చినది. భోజనాదికములైనవి. అప్పటికే యెనిమిదిగంటలైనది. విలాసిని గోపమంత్రిని సవినయముగ నర్థించినది.— "ప్రభూ! తామనుమతించుచో నొకపర్యాయము రాజగురువులను దర్శించి వత్తును. నేడు కొన్నివిషయములు బోధింతు మనినారు."

గోపమంత్రి మందహాస మొనరించినాఁడు. అతఁడు మానవమనస్థితిని జక్కఁగ గుర్తించినవాఁడు— "విలాసినీ! నిన్ను నీవే మోసగించుకొన యత్నించుచున్నావు. నీవు విరాగమునకై జన్మించినదానవు కావు. నీలోనున్న రాగాత్మికా వృత్తి విరాగమునకుఁ దావీయదు. కాని... నీ చర్యలవలన వ్యాసయోగీంద్రుల సాధనకు భంగము వాటిల్లవచ్చును. ఇతరుల సాధనాక్షేత్రమున కడ్డుతగులుట మంచిదికాదు. అట్టి యనధికారచర్య యిరువురికిని క్షేమముకాదు. ఇఁక రూపగర్వము స్త్రీజాతికి సహజము. నీ సౌందర్యము వ్యాసరాయలను కంపింపఁజేసినచో నీకు తృప్తి యొదవును. నీలో పరలోకచింత పొడసూపవచ్చును. కాని, అయ్యది బలీయమైనది కాదు— క్షణికోద్వేగము. అట్లని నిన్ను బలవంతముగ నాపఁజూచుచున్నానని తలఁపకుము. ఏవ్యక్తియు నొకవ్యక్తినిఁ దన యిచ్ఛమెయి బలాత్కారముగ త్రిప్పలేడు. నీ యిష్టము! సాధ్యమైనంత త్వరలో రమ్ము!"

విలాసినిహృదయము గోపమంత్రిముందు అప్రయత్నముగ నతమై పోయినది. ఆమె హృదయము సగద్గదమైనది. ఆమె యిరువురే వ్యక్తులను జూచినది. ఆమె నాకర్షించిన వారెండు ఆకృతులే! ఒకటి సంసారమునుత్యజించి సర్వసంగపరిత్యాగులై, ఆధ్యాత్మికతేజోవిభాసమానులైన వ్యాసరాయల ప్రశాంతగంభీరాకృతి. రెండవది స్త్రీహృదయమును సంపూర్ణముగ గుర్తించి భోగవిలాసాదు లనుభవించుచున్నను వివేకమార్యుఁడుగాక నిత్యసంతుష్టుఁడై భౌతికానందమున మునిగితేలు

గోపయామాత్యుల ప్రశాంతద రహసిత సుందరాకృతి. రెండును చిత్తాకర్షకములే! అప్రయత్నముగ నామె గోపమంత్రి పాదముల స్పృశించినది— సెలవుగైకొని బయలుదేరినది.

విలాశిని శిబిక నెక్కి- వ్యాసరాయాశ్రమముఁ జేరినది. వ్యాసయోగీశ్వరులు దర్భాసనముపైఁ గూర్చుండి యోగసాధనాసన్నాహమున నుండిరి. శిష్యుడొకఁడు గురువులకు విలాసినియాగమనవృత్తాంతమును వినిచినాఁడు. వారి శాంతపూర్ణమైన మోమున నించుక సంభ్రమము పొడసూపినది. గురువుల యాజ్ఞఁగొని విలాసిని గదిలోని కేతెంచినది. వ్యాసరాయ లామెను కూర్చుండ నియమించినారు. విలాసిని సాష్టాంగ మెఱగి దర్భాసనముపైఁ గూర్చుండెను. ఒక క్షణకాల మిరువురును మౌనము వహించిరి.

"నారాక గురువులధ్యానమునకు భంగముకల్గించినదా?"

"లేదు, కాని..."

"స్వాములు సెలవిండు! సందియమేల?"

యోగీంద్రులు మఱల మనసును స్వాధీన మొనర్చుకొనినారు— "విలాసినీ! ఆధ్యాత్మిక క్షేత్రము నీ వనుకొనినంత సుగమము కాదు. క్షణక్షణమునకును విఘ్నములు సంభవించు చుండును. వాటి నతిక్రమించునంతటి ఆత్మశక్తి యవసరము. అట్టిశక్తి నీకున్నదా!" వ్యాసయోగీశ్వరులు లేచి యిటునటు పచారులుచేయ మొదలిడినారు.

"ప్రభూ! ప్రయత్నింతును."

"కాదు. నీవలన కాదు. ప్రయత్నించినవా రెందరో విఫలులైనారు. ఒక్కక్షణకాలము నీమనస్సును ప్రశాంతముగా నుంచుటకు ప్రయత్నింపుము.''

విలాసిని కనులుమూసినది. ఎంతయో ప్రయత్నించినది. మనసు స్వాధీనమునకు రాలేదు. కనులు తెఱచినది— "ప్రభూ! మనసు నాయధీనమున లేదు. శాంతియననేమో నాకు తెలియకున్నది. శాంతియన అకర్మణ్యతయేనా ?''

"అవును అకర్మణ్యతయే! కాని వాస్తవముగ అకర్మణ్యత యనున దుండదు. అకర్మణ్యస్థితియందుసైతము మస్తిష్కము పనిచేయుచునే యుండును. శాంతి యనుదానికి సరియైన పరిభాష శూన్యము. అనగా ఏశూన్యమునుండి జనించినామో ఆశూన్యముననె లయమగుట. అదియే శాంతి. అయ్యది యింద్రియనిగ్రహమునగాని సాధ్యముకాదు. ఆ శూన్యస్థితియే శాంతి. అదియే ఆనందము. సాధన చేయగలవా ?''

''ప్రభూ ! నా కర్థమగుట లేదు. నామనస్సు శూన్యములోనికిపోజాలకున్నది.''

''అగుచో నీకు జ్ఞానమార్గము సరిపడదు. భక్తిమార్గ మనుసరింపుము''అని యామెను ప్రక్కగదిలోనికి గొంపోయిరి. అం దొక మందిరమున వేణుగోపాలునివిగ్రహ ముండెను. అయ్యది చలువరాతితోఁ జెక్కబడినది. కృష్ణుఁడు వేణువును చేబూని యూదుచున్నాఁడు. కేశములు విరియబోసికొని యున్నవి. శిఖిపింఛము శిరోభాగమున నొప్పుచున్నది. తులసి,

మందార, పారిజాతములఁగలిపి గుచ్చిన మాల లున్నవి. పొగడదండ యొండు పింఛమూలమున వ్రేలాడుచున్నది. ఆ విగ్రహమును చూపి— "ఇదుగో! గోపాలుడు! గోపీజన వల్లభుడు! మురళీధరుఁడు! ఈతనిని ప్రేమింపుము! ఈతనిని సేవింపుము! ఈతనిని పూజింపుము! ఇతఁడు భవహరుఁడు. భక్తజనరక్షకుఁడు. ఇతఁడే పరమాత్మ! పురుషుఁడు! మనమందరమును గోపికలము! ఈ మహాపురుషుని మనమున నిడుకొని ధ్యానింపుము."

విలాసిని చేతులుజోడించి యావిగ్రహమున కెదురుగ కూర్చుండెను. ఆ విగ్రహసౌందర్య మామెకు మిక్కిలినచ్చినది. తదేకధ్యానముతో నా విగ్రహమును దర్శించినది. కాని యెక్కువసేపు మనసు నిలువలేదు. ఇంతలో గోపమంత్రి జ్ఞప్తికి వచ్చినాఁడు. లేచినది. గురువుల యనుమతిఁగొని బయలుదేరినది. అప్పటికే పదిగంటలు దాటినది.

---

•

## ౩

అయ్యది యచ్యుతాలయమునకుఁ బడమరదిశయం దున్న వీధి. అం దొక భవన మున్నది. ఆభవన మంతపెద్దది కాకున్నను స్వల్పములైన అలంకారములతోఁ దన సహజ సౌందర్యమును వ్యక్త మొనరించుకొనుచుండెను. ఆయింటి ముంగిట నరుగుపై నొక తాటియాకులచాప యున్నది. దానిపై నుపవిష్టుఁడై తిమ్మనార్యుఁడు పారిజాతాపహరణకావ్యసంశో ధనము గావించుకొనుచుండెను. సరస్వతీపూజాసమయమున సార్వభౌముల కీగ్రంథ మంకిత మొనరింపవలెనని యాతని సం కల్పము. మధ్యమధ్య నాతఁడు గంటమునుచేతఁగొని యేదియో యాలోచించుచుండును. ఆయాలోచనలో నాతనినైదుష్యము, భావతన్మయత గోచరించుచుండును. అప్పటి కెనిమిదిగంట లైనది.

ఇంతలో రాజాంతఃపురమునుండి దాసియొకర్తుక వచ్చి నమస్కరించినది. తిమ్మకవీంద్రుఁడాదాసితో— "ఏమి? ఉదయమే వచ్చినావు? రాణులు క్షేమమా?" అనెను.

దాసి:—చిత్తము. చినరాణిగారు తమతో మాటాడ వలెనని యనుకొనుచున్నారు.

తిమ్మన:—నాతో మాట్లాడవలెననియా? సరియే! వచ్చుచున్నానని చెప్పుము.

దాసి వెడలిపోయినది. తిమ్మకవీంద్రుఁడు బయలుదేరి నాఁడు. మోమున త్రిపుండ్రములు తీర్చిదిద్దిన ట్లుండెను. మెడలో బంగరుతీగకు జుట్టిన రుద్రాక్షమాల, చేతులకు స్వర్ణఘంటాకంకణములు! ధౌతవస్త్రము కట్టి పండితశాలువ నుత్తరీయముగ సవరించినాఁడు. నల్లనిశరీరము, ఏబదివత్సరములపైఁబడిన వయస్సు. అతని కనులందు భావనాపటిమతోఁబాటు లోకప్రవృత్తిజ్ఞానము కన్పట్టుచుండును. అతని దీర్ఘోన్నతమైన నాసిక మోమునకొక ఠీవిని గూర్చుచుండెను.

అతఁడు తిన్నగ చినరాణియంతఃపురమున కేఁగినాఁడు. దాసి యాతనికై ప్రతీక్షించుచున్నది. తిమ్మనాఖ్యునియాగమనమును రాణికెఱిఁగించినది. చినరాణి కవీంద్రునకొక యాసనము వెట్టించినది. చినరాణి కావిరంగు బంగరు జలతారు తెరమాటుననుండియే యాతనికి నమస్కరించినది. కవీంద్రుఁ డాశీర్వదించి యాసనముపైఁ గూర్చుండెను.

తిమ్మన:—రాణులకుఁ గుశలమేకద!

రాణి:—"కుశలమున కేమిలెండు!" రాణికంఠస్వరమున దైన్యము గోచరించుచుండెను.

తిమ్మన:—రాణులు నేఁడేలకో సంశయించుచున్నారు. ఎన్నఁడునులేని దైన్యము మీనాఁడు మీమాటలందు గోచరించుచున్నది. తమకయిష్టము జరుగుటకు వీలులేదే! సార్వభౌములు మీకు సర్వదావశవర్తులేగదా! నావద్ద దాచవలసినవిషయము కానిచో సెలవిండు.

రాణికి డగ్గుత్తికఁదొడఁగినది. కనుకొనలనుండి రెండు కన్నీటిచుక్కలు చెక్కిళ్ళమీఁదుగ జాలువారినవి. రాణి కొన గోళ్ళతో వాటిని దుడిచినది. నిరస్తభూషయైనయామె విరహోత్కంఠితవలె నున్నది. దుఃఖోద్వేగము నాపుకొని యిట్లన్నది—"సార్వభౌములు నాకు వశవర్తులని లోక మనుకొనుచున్నది. కాని..." ఆమెనోట మాట పెగలిరాలేదు.

తిమ్మన:—మీయాంతర్యము నెఱుకపఱచుఁడు.

రాణి:—నావలన నొక యపరాధము జరిగినది.

తిమ్మన:—ఏమీ! తమవలన నపరాధమా?

రాణి:— "అవును! అందుచే సార్వభౌములు నాయెడ..." రాణి యిఁక మాటాడలేకపోయినది.

తిమ్మన:—తమరు విచారింపకుడు! అర్థమైనది, నాయోపినకొలఁది ప్రయత్నింతును.

రాణి:—ఎప్పటికైనను మీఋణమును దీర్చికొందును.

తిమ్మన:—మీరింత దైన్యముగ నుండఁగూడదు. ధైర్యము వహింపుఁడు. సార్వభౌములను ప్రసన్నులగునట్లొనర్పుటకుఁ బ్రయత్నింతును. సెలవా?

రాణి దాసిచే కవీంద్రులకు ఫలములను తాంబూలమును నిప్పించి పంపివేసినది. తిమ్మన బయటకేతెంచి చెలికత్తె నడిగినాఁడు. ఆమె జరిగినవిషయము నివేదించినది—"కడచిన సోమవారమునాఁడు సార్వభౌము లిచటి కేతెంచినారు. అప్ప

టికి నెలదినములైనది వారీయంతఃపురమునకువచ్చి. చినరాణి గారు పేరలుకఁ జెందియున్నారు. సార్వభౌము లేతెంచి యను నయించునవసరమున నామెపాదము మహారాజులవక్షస్థలమునఁ దాకినదట! అందుపై కోపగించి సార్వభౌములు చరచర వెడలి పోయినారు. నేటివఱకును వారీమందిరమును త్రొక్కలేదు.''

ఇది విని తిమ్మకవీంద్రుఁడు తలపంకించి యింటికి బయలు దేరినాఁడు. చినరాణికి తిమ్మనయనిన నభిమానము. అప్పు డప్పుడు రాణి పురాణముఁజెప్పుట కాతనిని బిలిపించును. అతని కవిత్వమన్నను పురాణపఠన మన్నను నామెకు మిక్కిలి యిష్టము.

తిమ్మన యింటికి బయలుదేరినాఁడు. పదిగంటలు దాటి నది. దేవతార్చనమును భోజనమును నిర్వర్తించుకొని యించుక విశ్రమించినాఁడు. అతఁడు చినరాణికివాటిల్లిన దురవస్థను చింతిం చినాఁడు—— ''ఆహా! కాలమహిమ! తనసౌందర్యాతిశయ ముచే సార్వభౌముల లోఁగొని తన యిచ్ఛమెయి నాడించిన చిన్నాదేవిస్థితి నే డెంత శోచనీయముగనున్నది! ఆరూపగర్వ మున కియ్యది ప్రాయశ్చిత్తము! భగవానుఁడు జీవితమున కష్ట సుఖముల నిట్లు సమభాగములుగ పంచునుకాబోలు! సార్వ భౌములకుఁ జిన్నాదేవియనిన ప్రాణము. మహారాణిపై నాద రాభిమానములు మెండు. చినరాణిపై ననురాగము మెండు. సార్వభౌములనుఁ బ్రసన్నుల నొనరించుటెట్లు? తన కావ్య నాయిక సత్యామానిని జ్ఞప్తికి వచ్చినది. మహారాజులు రసజ్ఞ

శేఖరులు. ఆరసికావతంసునిహృదయమును మార్చుటకుఁ గవిత్వమేసమర్థము. సరసహృదయుల కొకమాటయే చాలును—మనసుమారుటకు! మొఱటువాని కెంతచెప్పినను లాభములేదు. సరే! రేపు సరస్వతీపూజాదినమున కృతిస్వీకారమును, సాహితీగోష్ఠియు జరుగునుగదా! ఆనాఁడే కార్యమును సాధింపవలెను. కవితాశక్తిచే సామ్రాజ్యమునే నిలబెట్టినాఁడట కవిబ్రహ్మ. ఉయుభయకవిమిత్రునంతటి ప్రజ్ఞ లేకున్నను నీ స్వల్పకార్యమును సాధింపఁజాలనా?''

సాయంకాల మైనది. కమ్మతెమ్మెరలు హాయిగొల్పుచున్నవి. చూపుమేరదూరమున కొండలపైనుండి పసులకాపరులు గృహోన్ముఖులైనారు. నదీతీరమున పల్లెకారులపిల్లలుతుంగభద్రాఘోషములఁ జిఱుతెప్పలపై నీదుచున్నారు. రసికులు కొందఱు ధౌతదుకూలధారులై ముంజేతులను, మెడలందును పుష్పమాలల నలంకరించికొని తమ్ములముల నమలుచు వాహ్యాళి కేతెంచిరి. ప్రకృతియంతయు రమణీయముగనున్నది. నదీతీరమేగాక నదిపై గల ఱాతివంతెనపైగూడ యాతాయాతజనసమ్మర్దము హెచ్చుగనున్నది. తిమ్మనకవీంద్రుఁడు లేచి నదీతీరమునకుఁ బయనమైనాడు.

సూర్యాస్తమయ మైనది. బురుజులపై దీపమాలికలు వెలిగినవి. రాచనగరుననుండి సాంధ్యసమయమంగళవాద్యములు మంద్రముగ వినవచ్చుచున్నవి. సార్వభౌములు కొలువు చాలించి సాంధ్యసమయపూజాకలాపముల నిమగ్నులైరి. దండ

నాధులును సామంతులును దమసైన్యములచే సైనికవిన్యాస ములఁజేయించి సభామంటపమునకెదురుగ నారువరుసలలో నిలువఁబెట్టిరి.

సార్వభౌములు పూజాగృహమునుండి పురోహితులతోఁ గూడ బయటకేతెంచి యొక యెత్తైనవేదికపై నిలువఁబడి యుండిరి. నిలువబడియున్న సేన సార్వభౌములకు సైనికవందన మాచరించినది. రాజపురోహితులు కలశోదకమును, పూవు లను గొని యాసేనను సమంత్రకముగ నభిమంత్రించిరి. అనం తరము సార్వభౌములు మూడుదోసెళ్ళతో గులాబిపువ్వులను గొని గజాధిరాజముపై నుంచిరి. శతఘ్నుల మ్రోతకు భూమి కంపించిపోయినది.

పూజావిధులను నిర్వర్తించుకొని రాయలవారు నిజభ వనమున కేతెంచినారు. రెండుదినములనుండి సార్వభౌముల మనోవీధిని విలాసిని పొడగట్టుచున్నది. ఆమెదర్శనము సార్వ భౌములహృదయమున నిగూఢమైయున్న యొక యజ్ఞాతవేద నను ప్రజ్వలింపఁజేసినది. ఆమెను జూచిననాటినుండియు తుకాంబ జ్ఞప్తికివచ్చుచున్నది. వేశ్యయందీ తుకాంబపోలిక లేమి? గజపతికోమలితయైన తుకాంబకును నీమెకును నింతటి సామ్య మున్నదేమి? పదునెనిమిది వత్సరములైనది— ఆమెచనిపోయి. తుకాంబస్మృతి సార్వభౌములహృదయమును కలఁచివేసెను. నారీసులభమైన రూపగర్వము జూపినందులకు— పట్టమహిషినితృణీకరించినందులకు తానామెనుశిక్షించినాఁడు. ఆశిక్షయెట్టిది? నారీజాతి కంతకంటె నరకములేదు. పరిత్య

ంచుటయా ? మానినీశిరోవతంసమున కంతకంటె మరణము లుకాదా! అల్లైజరిగినది. ఆమానిని యాయవమానమును రింపఁజాలకపోయినది. పతిమెచ్చనిచెలువు నిష్ఫల మనుకొని ది. భర్తృప్రేమకుదూరమైన తనజీవితము వ్యర్థ మనుకొనినది. మైనదో తెలియదు. భర్తృవియోగమున, నవమానమున, ్రశించి యసువులవీడినదని వార్తవచ్చినది. అప్పుడాకోపోద్వేగ ున సార్వభౌముహృదయము చలింపలేదు. కాని... పదు నిమిదవత్సరములైనపిమ్మట నేఁ డామెస్మృతి సార్వభౌముని హృదయమును కలఁచివేయుచున్నది.

తుక్కాంబ గజపతిపుత్రి. కాని, పట్టమహిషివలనఁగలి న కుమార్తె కాదు. మహారాణికుదయించిన చినరాణితోఁ టు ఇతరరాణులందుజన్మించిన మఱికొందఱినిగూడ శ్రీకృష్ణ వరాయసార్వభౌములకిచ్చి పరిణయ మొనరించినాఁడు గజ తి.కొలదిదినములవఱకును తుక్కాంబ తననిరుపమానసౌందర్య లాసాదులచే సార్వభౌముని వశమొనర్చుకొనినది. సార్వభౌ ులు తుక్కాంబవలన సంప్రీతులైనారు. తుక్కాంబమాట లామణియైనది. ఒక యేఁడాది గడచినది. తుక్కాంబ తన కి గర్వించినది. సార్వభౌముఁడు తనకనుకూలుఁడని విఱ్ఱవీఁగి ది. మహారాణితో స్పర్థపెంచుకొనినది. కుటుంబకలహముల ెకట్టుట కామెను కంభమువంపినారుసార్వభౌములు. బాల నుని రాగరంజితకిరణప్రసారమున మేల్కాని తుహినబిందువు తో మోముఁగడిగి మందమలయానిలుకౌగిలింతలపులకరించి క్షసౌరభముచే పరిసరములనలరించినసుమము చండభానుని

ప్రచండతాపాఘాతమున వాడి నేలఁ్రాలినది. కాలము దానిపై నెండుటాకులను గప్పినది.

అంతియే! ఆనాటినుండి మఱల ప్రభువునకు తుకాాంబ ధ్యాసయే లేదు. చిన్నాదేవి తుకాాంబస్థాన మాక్రమించినది. ఇన్నినాళ్ళకు మఱల నామెను గుఱించిచవ్యాకులము కలిగినది. ఈ వ్యాకులమునకుఁ దోడైనది ప్రస్తుతము చిన్నాదేవిపైఁ గోపము! అతనిమనసు గందరగోళముగ నున్నది. ఎవరితో నైనఁజెప్పుకొనినఁ గొంత యుపశమనముగల్గునేమో! ఎవరితోఁ జెప్పుకొనును? చిన్నాదేవితోఁ జెప్పుకొనవలె. ఆమెయూరడించవలె. మహారాణి యున్నది. ఆమెకీ గొడవలేదు. తన్ను సరిగఁజూచుటయే యామెకుఁగావలె. పదిదినముల కొకతూరి యైనను ప్రభువులదర్శనమైన చాలును. ఆమె కితరవిషయములతోఁ బ్రసక్తి లేదు. ఆమెకు అనునయములు చేతగావు. అచటి కేఁగినచో ప్రభువే మహారాణి ననునయింపవలసివచ్చును. ఆమె యెల్లప్పుడును దిగులుగనుండును. ఆదిగులునకుఁగారణము పుత్రసంతానహీనత! కలిగినపుత్రసంతానము నష్టమగుట! ఈదుఃఖము సార్వభౌములకును నున్నది. కాని, యేమి చేయును?

తుకాాంబస్మృతివలన సార్వభౌములహృదయము చినరాణియెడల కొంచెము స్నిగ్ధమైనది. ఆమెయంతఃపురమున కేఁగుద మనుకొనినాఁడు. కాని, మఱల తనపట్టుదల జ్ఞప్తికి వచ్చినది. ఆనాటియవమానము స్మృతిపథమున మెఱసినది—

'ఆడుదాని కంతటిగర్వమా! ఆనాఁడు తుకాంబ! ఈనాఁడు చిన్నాదేవి! ఈజాడ్యము గజపతిసంతానముననే యున్నదా! కర్ణాటరాజ్యరమాపీఠమైనవక్షమునఁ గాలానుటయా? నావలన నేరమేమి? పదిదినములు కనఁబడలేదు. ఎల్లప్పుడు వారివద్దనే పడియున్నచో రాజకార్యములు సాగుటెట్లు? రాజులు బహుపత్నీకులని యెఱుంగునుగదా! వారును తనవంటివారే! ఇంతలోననే నింతటిగోపమా! కోపమునకుమాత్రము హద్దు పద్దు లుండవలదా? సాగినచో నింకను సాగించును. ఆ గర్వమునకుఁ దగిన ప్రాయశ్చిత్త మనుభవింపవలసినదే!'' యనుకొనినాఁడు.

అప్పటికే పదిగంట లైనది. ఏమియుఁ దోచుటలేదు. మాటాడుట కెవరును లేరు. మహారాణియంతఃపురమున కేఁగుదమనుకొనినాఁడు. తల్పమునుండి లేచినాఁడు. కంచుకీజనమును మహారాణిమందిరమునకు నడువుఁడనినాఁడు. కంచుకీజనపరివృతుఁడై బయలుదేరినాఁడు.

మహారాణిచెలికత్తెయొకర్తుక సార్వభౌములయాగమనము నెఱింగించినది. మహారాణి యెదురేఁగి సార్వభౌములను లోనికిఁ గొంపోయినది. మృదులతల్పముపైఁ బరుండపెట్టినది. కప్పురపు విడె మొసఁగినది. పాదములచెంతఁ జేరినది. ప్రభువు సంతుష్టుఁడై నాఁడు— ''దేవీ! కుశలమా?''

''ప్రభువులయనుగ్రహముండ కుశలమున కేమికొదువ? నవరాత్రోత్సవములమూలమున ప్రభువులకుఁ దీరిక లేకున్నది కాబోలును!''

"అవును! పవలంతయు నుపవాసము! ఉత్సవకార్య కలాపములనుండి నివృత్తులమగునప్పటి కీవేళ యగుచున్నది."

"దీక్షా కాలమంతయుఁ బ్రభువులకు బడలిక యెక్కువగానే యుండును. ఒక్క నలుసున్నచో నీ పెద్దతనమున కొంత భారము తగ్గెడిది."

"ఆయదృష్టము మనకు లేదు."

"నాకు లేకున్న లేకుండుగాక! నాకడుపున నీవటికే చిచ్చుపడినది. మిగిలినవారికైన నొక్కబిడ్డఁడు కలుగకుండదా?"

"మహారాణీ! అయ్యది మన పూర్వకర్మఫలము. నేఁడు వగచి ప్రయోజనము లేదు. మన యదృష్టమే మంచిదగుచో నాశిశువే బ్రతికియుండెడివాఁడు. ఇఁక చింతించి లాభము లేదు." సార్వభౌములమోము విషాదావృత మయ్యెను. మనశ్శాంతికై వచ్చినాఁడు, పూర్వబాధకుఁ దోడైనది, యీనూతనప్రసంగమువలనని కలిగినబాధ. మహారాణి సార్వభౌములస్థితిఁ జూచి తన యజ్ఞతకుఁ జింతించినది. వారిమనసును మఱియొక వైపునకుఁ ద్రిప్ప యత్నించినది— "ప్రభూ! లక్ష్మీనారాయణదీక్షితుల వలన వింటిని—కొండవీటినుండి యొక వేశ్యవచ్చినదటగదా! భరతగాంధర్వప్రవీణయుట! ఆమె లక్ష్మీనారాయణపండితుల శిష్యురాలేనట!"

"అవును! నా కామె వేశ్యవలెఁ దోచుటలేదు. గోప మంత్రి కామె ప్రేయసియట!"

'పండితులవారామె మంచిశీలవతియనియు రూపవతి యనియు ననినారు."

సార్వభౌములకు మఱల తుకాంబ జ్ఞప్తికివచ్చినది. వదన మించుక విషణ్ణమైనది. మనసు వికలమైనది. దృష్టులు శూన్యములైనవి. రాణి ప్రభువులను వీక్షించినది. తా నొనర్చిన ప్రయత్నము ఫలింపలేదు. సంతానవిషయము దుఃఖహేతువైనదని యీవిషయ మెత్తినది. ప్రభువులకు పూర్వము కంటె నెక్కుడుకష్టము కలిగినట్లున్నది. వారిదుఃఖమును పసిగట్టినది— "ప్రభూ! నేఁడేలకో విచారముగ నున్నారు?"

ప్రభువు మాటాడలేదు.

రాణి మఱల ప్రబోధించినది... "ప్రభూ! సమయము కానిసమయమున నామెప్రసంగ మెత్తితినికాబోలును! తెలియక కుతూహలమున నామెప్రసంగ మెత్తితిని. మన్నింపుఁడు!"

ప్రభువు ప్రబోధితుఁడైనాఁడు— "మహారాజ్ఞీ! నీయందు దోసము వీసమైనను లేదు. తుకాంబ నెఱుఁగుదువా?"

"తుకాంబనే యెఱుఁగనా ప్రభూ?"

"ఆమె వెడలి యెన్నినాళ్లైనది?"

"పదునెనిమిదివత్సరములు దాటినవి."

ప్రభువు మఱిమాటాడలేదు. కంఠము సగద్గదమైనది. అంతకంటె నెక్కుడుగ మాటాడుటకు ప్రభువు సాహసింపలేదు— ప్రయోజనమును లేదు. తనహృదయదౌర్బల్యము వ్యక్తమగు

నేమోయని వెనుకాడెను. గడచినదానికై నేడు వగచియు ప్రయోజనములేదు. కాని– యామెను తాను పరాభవించినాడు –పరాభవించుటేకాదు, మృత్యుదండనయే విధించినాడు. ఆమెమరణమునకు బాధ్యుఁడు తానుకాఁడా? తత్ఫలమును తా ననుభవింపకతీరునా? ఈపాపభీతి మనసును బాధింపఁజొచ్చినది.

వయసులోనున్నప్పుడు మానవునకుఁ దోపనివిషయములు వార్థక్యమునఁ దోచును. కాని, యానాఁడు శోచియుఁ బ్రయోజనములేదు. యౌవనమున పరిహాసాస్పదముగఁదోచిన కోరికలు వార్థక్యమున ననివార్యమైనవై హృదయమును వేధించును. ఆనాడుతుకాంబపైఁ గోపము! ఈనాఁడు అనుకంప– పశ్చాత్తాపము. ఆనాఁడు నిర్లక్ష్యము! ఈనాఁడు, మమకారము! ఆనాఁడు ప్రియుఁడు! ఈనాడుభర్త! ఆనాడు సంతానహీనత వరదానము! ఈనాఁ డభిశాపము! మానవునిలోని పరివర్తనము విచిత్రము!

మహారాణి ప్రభువులమానసికాందోళనమును గుర్తించినది. కాని, కారణ మూరయలేదు. పదునెనిమిదివత్సరములనుండీ ప్రభువులు తుకాంబప్రసక్తి నెత్తలేదు. నేఁడు వారినోట తుకాంబవిషయమువచ్చుట రాణికాశ్చర్యమును కలిగించెను. అందును తనయెదుట నామెప్రసక్తినెత్తుట! ఆమెబహిష్కృతి కొక కారణమైన తనయెదుట! ఇఁక మఱల ప్రశ్నించి ప్రభువులగాయమును రేపుట కామె సాహసింపలేకపోయెను. అందుచే ప్రసంగము మార్చినది— "ప్రభూ! రేపు సరస్వతీ

పూజాసమయమున తిమ్మకవీంద్రుల పారిజాతాపహరణకావ్య స్వీకారము జరుగునట! నిజమేనా?''

''అవును! కావ్యము పూర్తికావచ్చినదని వింటిని.''

''చాలదినములైనది సాహిత్యగోష్ఠికేతెంచి, ప్రభువు లనుమతించుచో!''

''తప్పక''

రాణి స్వామికి ద్రాక్షారస మందించినది. పాదము లొత్తుచుండగనే సార్వభౌములు నిదురించినారు.

---

•

౪

తెల్లవారినది. తిమ్మనార్యుఁడు కాల్యముల నిర్వర్తించుకొనినాఁడు. చక్రతీర్థమున గ్రుంకి, సంధ్యావందనాద్యనుష్ఠానముల బూర్తిచేసికొని యింటి కేతెంచినాఁడు.

అతఁడు దర్భాసనముపైఁ గూర్చుండి పారిజాతాపహరణకావ్యసంశోధన మొనరించుచున్నాఁడు. అచ్చటచ్చట కొన్ని పరివర్తనములు చేయుచున్నాఁడు. ఇంతలో నయ్యలరాజురామభద్రుఁ డేతెంచినాఁడు. నలుబదిసంవత్సరముల వయస్సు. సన్నని పొడవైనశరీరము. దబ్బపండువంటి మేని కాంతి. తిమ్మకవి యాతనికొక చాప వైచినాఁడు. రామభద్రకవి యాసీనుఁడగుచు—— "ఇంకను కావ్యము పూర్తికాలేదా?"

"అయినది! అచ్చటచట పరివర్తనములు చేయుచున్నాను. రామభద్రకవీ! ఒక్కవిషయమున నీయభిప్రాయముఁ జెప్పుము!"

"తిమ్మకవీంద్రులవాణికి నాయభిప్రాయమా?"

"కాదోయీ! ఏమియుఁ దోఁచుటలేదు. నీవంటివారు నలుగురు సమ్మతించినచో నాకు ధైర్యము కలుగును."

"విషయ మేమియో సెలవిండు."

"సత్య పేరలుకఁ జెందియున్నది. గోపాలుఁడేతెంచి యనునయించుచున్నాఁడు. అనునయసమయమున నాతనికరము

లామెచరణములకుఁ దాకినవి. అంత నామె యాచతుర్దశభువన భరణసమర్థములైన హరిపాణిపల్లవములఁ దనపాదములచే నవలఁద్రోసినది. ఇయ్యది సంభవమేనా?

"సంభవ మేలకాదు?"

"ఉచితమగునా?"

"పేరలుకఁజెందినవా రుచితానుచితముల నెఱుంగుదురా?"

"ఔచిత్యమునకు భంగము కలుగదా?"

"మనకుఁ గృష్ణుఁడు పరమాత్మ! సత్యకు ప్రియుఁడే కదా! అతనికి సత్య ప్రాణప్రేయసిగదా! అందుచేతనేగదా యామె ననునయింపవలసివచ్చుట! కృష్ణుని సామాన్యప్రియుని రూపమునజూచుచో నౌచిత్యభంగ ముండదు."

"ఎట్లైనను కాలితోఁదన్నించుట అప్రస్తుతమేమో!"

"కాలితో పాణిపల్లవములఁ ద్రోయించితివిగాని, మ్రొక్కినపుడు శిరమునే తన్ని నతన్న గూడదా? నాదృష్టియందిచట ఔచిత్యానౌచిత్యప్రశ్న లేనేలేదు."

"శిరమునఁదన్నుటయా? పాపముశమించుగాక!"

"పాపమేమిపాపము? మనకు పాపము! సత్యకేమి పాపము? ఆమానినికంతటి యవమానమునుఘటించుట పాపము గాదా? దానికిఁదగిన ప్రతిఫలము వలదా?"

తిమ్మనకుఁ గొండంతధైర్యము కలిగినది. తాను తల పెట్టిన ప్రయోజనమును వినిపించినాఁడు. తా నంతకుఁబూర్వమే

రచించియుంచిన పద్యమును చదివి వినిపించినాడు—“రామ భద్రకవీ! మీరందఱును నేకీభవించి కార్యము సానుకూల మగునట్లు చూడవలెను. చెప్పితినిగదా చినరాణిపరిస్థితి.”

“తిమ్మనార్యా! ఇయ్యది నాబోంట్లవలన కాదు. గురు వులు కవితాపితామహులు తలచుకొనవలెను. ప్రక్కతాళము నకుమాత్రము మే ముందుము. కాని... మఱి యాతఁడో?”

“ఆతఁ డెవఁడు?”

“వ్యాసరాయలు! రాజగురువు! అతఁడు సామాన్యుఁడు కాఁడు. అతని కక్కఱలేని విషయము లేదు. ప్రతివిషయమునను నే నున్నానని తయారగును. అతనితో నొక పెద్దచిక్కు. ముక్కు మూసికొని తపము చేసికొనక తనకీగొడవ లేల? రాజగురుత్వము చాలదో? ఏమైనను కవితాపితామహులు తలఁచినచో కార్యము సానుకూలము కావచ్చును. వారైనచో వ్యాసరాయల నైనను లెక్కచేయరు.”

“అవును! వ్యాసరాయలవిషయము భయముగనే యున్నది. ప్రతివిషయమునను జోక్యముఁ గల్గించుకొనును. మొన్న విలాసినివిషయమున జూచితివిగదా! చక్కగ బుద్ధి చెప్పినది. కానిచో.. సర్వసంగపరిత్యాగియైన తనకీగొడవ లెందుకు?”

“ఇంతను శృంగభంగము కావలెను.” అనుచు రామభద్రకవి లేచినాడు. తిమ్మన యాతనిని సాగనంపి గ్రంథమును దేవతామందిరమున నిడి పెద్దనామాత్యుల యింటికిబయలుదేరినాఁడు.

పదిగంటలైనది. పెద్దనామాత్యుఁ డింట లేఁడు. ఇంకను సభాభవనమునుండి మఱలిరాలేదు. పెద్దనార్యుని భార్య యాతనిని బలుకరించి కూర్చుండుమనినది. అతఁడు చావడిలో నున్న యుయ్యాలపై గూర్చుండెను. అతనిమనసు భావనా తరంగములఁ దేలియాడుచుండెను. ఒకయరగంట గడచినది. శిబికావాహకులశబ్దము వినవచ్చినది. ఆంధ్రకవితాపితామహుల రాకను గుర్తించినాఁడు. వీథిలోని కేఁగి చూచినాఁడు. ఇంతలోఁ బల్లకి ద్వారము వెంత నాగినది. పెద్దనార్యులు దిగినారు. పచ్చని శరీరము. మెడలో బంగరుకట్లుగల రుద్రాక్షమాలలు. ఫాలమున విభూతిరేఖలమధ్య నొక కుంకుమబొట్టు. పాదమున సార్వభౌములుతొడిగిన గండపెండారము రత్నదీధితులఁ జిమ్ముచున్నది. కుడిచేతికొక మణిఖచితమైన స్వర్ణఘంటాకటక మున్నది. చెవులకుఁ గెంపులుపొదగఁబడిన కుండలము లున్నవి. అరువదేడులవృద్ధాప్యమున బయలుదేరిన చిఱుబొజ్జ యందముగ నున్నది. గండభేరుండపుటంచులవలిపెమును ధరించి కాశ్మీరపు శాలువను పైన కప్పిరి.

పల్లకినుండి దిగినంతనే తిమ్మన కవితాపితామహునకు నమస్కరించినాఁడు. లోపలినుండి పరిచారికయొక ర్తుక పాదప్రక్షాళనమునకు నీరు తెచ్చినది. పెద్దనార్యుఁడు పాదప్రక్షాళన మాచరించి తిమ్మకవిని లోనికిఁ గొంపోయినాఁడు. ఇరువురును నూయెలపై నుపవిష్టులైరి. పెద్దనార్యుఁడు తిమ్మనను జూచి— "ఏమోయీ! నేఁడు నీవు సభకు రాలేదేమి? నేఁడు సభలో నీప్రశంసవచ్చినది." అనెను.

"ఏమని? ఎవరు తెచ్చినారు?"

"సార్వభౌములే ప్రశ్నించినారు. పారిజాతాపహరణ కావ్యరచనము పూర్తియైనదా?"

"అయినది. కాని..."

"సందియమేల?"

"ఇంకను నచ్చటచట కొన్ని పరివర్తనములు చేయవలసి వచ్చునేమో!"

"తిమ్మనార్యులపలుకులకు పరివర్తనములా?"

"నాపైనున్న వాత్సల్యమున నట్లనుచున్నారు. పరివర్తనము లవసరములైనవి. పరిస్థితు లట్లు వచ్చినవి. పితామహులతో సంప్రదించుటకై వచ్చితిని. తమ యామోదముద్రపడిన చో కృతిసమర్పణము జరుగును."

"పరిస్థితు లేమిటి?"

"చినరాణిగారు మన సాయ మర్థించినారు."

"చిన్నాదేవిగారా? ఏమది?"

"సార్వభౌములు చినరాణిగారియంతఃపురమున కేగుట లేదట. వారిదర్శనమై చాలకాలమైనదట."

"కారణము?"

"ప్రణయకోపావసరమున రాణిచరణము మహారాజుల వక్షస్థలమును దాకినదట! అందుకు సార్వభౌములు కోపించి వెడలిపోయిరట! మఱల సార్వభౌములను ప్రసన్నుల నొనరింపవలెను."

"మన మిత్రవిషయముల నెట్లు జోక్యముకల్పించు కొనగలము? అయ్యది సార్వభౌములకుఁ గోపకారణమగునేమో! అయ్యది రాజగురువులో లేక అప్పాజీవారో నెఱవేర్ప వలసిన పని. మనవలన నగునా.?"

"ప్రయత్నించిచూతము! నాకొక యుపాయము తోఁచు చున్నది"

"ఏమది ?"

"సార్వభౌములు రసజ్ఞశేఖరులు. కావ్యమర్మనిష్ణాతులు. పారిజాతాపహరణకావ్యమున శ్రీకృష్ణుఁడు సత్యాభామానిని నను సయించుసందర్భమున సార్వభౌములహృదయమును స్పృశించు టకుఁ బ్రయత్నించుచోఁ గార్యము సానుకూలమగునేమో!"

"మంచిది. ప్రయత్నించిచూడుము. తప్పేమున్నది ?"

"ఇయ్యది కేవలము నావలనజరుగునది కాదు. సార స్వతపితామహులు పూనుకొనవలెను. ఆఘట్టమును వ్యాఖ్యా నించి సార్వభౌములహృదయమును కదల్పవలసియుండును."

"ఏదీ ! ఆఘట్టము ?"

తిమ్మన యాఘట్టమును చదివి వినిపించినాఁడు. పెద్ద నార్యుఁడు తలయూపినాఁడు — "బాగున్నది. సందర్భము సరి పోయినది. ప్రయత్నించిచూతము."

"ఇందనౌచిత్య మేమైన నున్నదా ?"

"ఔచిత్యానౌచిత్యములనిర్ణయము ఫలితమునుబట్టి తేలిపోవునుగదా! మనచేతనైనంతవఱకు ప్రయత్నింతము! అంతకుమించి యేమిచేయగలము?"

"అదియే నేనును గోరునది. సెలవు" అని తిమ్మన యింటికి బయలుదేరినాఁడు.

మహారాణికి రాత్రి సార్వభౌములప్రవర్తనము విచిత్రముగ దోఁచెను. ప్రభువునకు పదునెనిమిది సంవత్సరముల తరువాత నేఁడు తుక్కాంబ యేల జ్ఞప్తికివచ్చినది? వేశ్యయైన విలాసిని విషయము మాటాడుచుండ ప్రభువులు తుక్కాంబనేల స్మరించినారు?

మహారాణి మనోఫలకమున తుక్కాంబ సాక్షాత్కరించినది. తుక్కాంబను వెడలనడచుటలో తా నొనర్చిన దోష మేమియు లేదు. ఒకసంవత్సరముపాటు సార్వభౌములను లోగొన్నది. గర్వించినది. పట్టపురాణికావలె ననుకొన్నది. ప్రసంగవశమున నప్పుడప్పుడు తన్ను తిరస్కరించినది. సార్వభౌములతోఁ దా నేమియుఁ జెప్పలేదు. ఆయనకే యసహ్యము కలిగినది. ఈవిధముగ మహారాణి తనహృదయమును సమాధానపఱచుకొనుటకు యత్నించినది. కాని ఆ సమాధానము నిలువలేదు. ఆనాఁడు తనమనసులోనిమాలిన్య మామెకుఁ దెలియును. తుక్కాంబయెడల నాడు తనమనసులో నసూయ యున్నది. ప్రభువుతోఁ దాను తుక్కాంబపైఁ గొండెములు చెప్పకపోవచ్చును. ఆమెనిర్యాసనమునకుఁ బ్రోత్సహింపకపో

వచ్చును. కాని తాను సపత్నీధర్మమున ప్రభుపురువారించుట ధర్మముకాదా? అంతియేకాదు. అప్పటికి తుకాంబ గర్భిణి యని తనకుఁ దెలియును. పైకి పొక్కనీయలేదు. కారణ మేమి? తనకుమారుని స్వార్థముకోరికాదా? ఆబాలుఁడు చనిపోయినాఁడు. మహారాణియాశ లడుగంటినవి.

తా నొనర్చిన మహాపాపమునకు ఫలితమే పుత్రశోకము! తా నొనర్చిన మహాపాపమునకు ఫలితమే మఱల పుత్రసంతానము కలుగకుండుట ! రాణి యీవిచారముతోఁ గంపించి పోయినది. ఆమెకు బిచ్చియెత్తినట్లైనది. తుకాంబవెంట వచ్చిన పరిచారికలెవరును నేఁ డిచట లేరు. ఎవరిత్రోవన వారు వెడలిపోయిరి.

మహారాణి తనదాసిని పిలిచినది.— "సీతా! గోప మంత్రిభవనము నెఱుఁగుదువా ?"

"ఎఱుఁగుదును."

"వారియింట విలాసినియనునామె యున్నది. ఆమె గోపమంత్రికి ప్రేయసి. ఆమెనొక్కసారి పిలువుము !"

దాసి బయలుదేరినది. దాసివచ్చునప్పటికి గోపమంత్రియు విలాసినియు భోజనములొనర్చి సుఖాసనములఁ గూర్చుండి యేమియో మాట్లాడుకొనుచుండిరి. ద్వారరక్షకుఁడు లోనికేఁగి మహారాణులు పరిచారికను పంపినా రని తెలియఁజేసినాఁడు. గోపమంత్రి యామెను లోనికిఁ బంపుమనెను. దాసివచ్చి గోపమంత్రికిని విలాసినికిని నమస్కరించి

నది. గోపమంత్రి ప్రశ్నించినాఁడు—"మహారాణు లేమైనపని మీఁద పంపినారా ?"

"చిత్తము"

"ఏమది ?"

"ఈయమ్మగారిని చూడవలెనని మహారాణులు కోరుచున్నారు." అని దాసి విలాసినివైపుఁ జూచినది. విలాసిని గోపయామాత్యులవైపుఁ జూచినది. గోపమంత్రి చిఱునవ్వునవ్వినాఁడు— "అట్లేవచ్చును. నీవుపొమ్ము!" అని దాసిని పంపివేసినాఁడు.

"సీకీర్తి యంతఃపురమునకుఁగూడ ప్రాకినది. చూచితివా ?" గోపమంత్రి నవ్వుచుననెను.

"బాగుగనే యున్నది! ఎందులకు పిలిపించియుందురో!"

"తమదర్శనమునకు !"

"ఎప్పుడును వేళాకోళములే !"

"సార్వభౌములు సత్కరించినారుగదా ! మహారాణుల సత్కారములనుగూడ నందుము."

"మీ రావిధముగ మాటాడిననేను వెళ్ళనే వెళ్ళను." విలాసిని కోపమునభినయించినది. గోపమంత్రిబుజ్జగింపుతో లేచినది. చక్కగ సింగారించుకొనినది. అంతఃపురమునకు శిబికపై బయలుదేరినది. దాసి ముందేఁగి యామెయాగమనమును మహారాణికిఁ దెలియఁజేసినది.

మహారాణి మృదులతల్పముపైఁ గూర్చుండియున్నది. రాణియాజ్ఞననుసరించి దాసి విలాసినిని లోనికిఁ గొంపోయినది. విలాసిని మహారాణికి నమస్కరించినది. రాణి యామెను గూర్చుండ సంజ్ఞచేసినది. విలాసిని యాసీనయైనది. మహారాణి మాటాడలేదు. తదేకధ్యానమున విలాసినిని జూచుచున్నది.

విలాసినియే యడిగినది — "మహారాణులు నన్నేలకో పిలిపించినారట!"

"ఏమియును లేదు. చూడవలెనని. మొన్న నీ నాట్యనృత్య ప్రశంస లక్ష్మీనారాయణపండితులు వినిపించినారు. రాజగురువులతో వాదమునకుదిగినట్లును వినినాము. చూడవలెనని కుతూహలముకలిగినది."

"క్షమింపుఁడు. రాజగురువులతో వాదించునంతటి శక్తి నాకు లేదు. క్షణికావేశమున నట్లొనర్చితిని. పిమ్మట క్షమాపణవేడితిని. ఇఁక నృత్యప్రదర్శన మందురా? అయ్యది లక్ష్మీనారాయణపండితులభిక్ష. నాప్రయోజకత్వము కాదు."

రాణి కాశ్చర్యముకల్గినది— "రాజగురువులతో వాదించి స్త్రీలకు ఆస్థానవిద్వన్మండలిలో నొక స్థానము కల్పించినావని వింటిమే! క్షమాపణయేల?"

"అయ్యవి శాస్త్రమునకుసంబంధించిన వాదోపవాదములు కావు. అంతటిశక్తి నాకు లేదు. రాజగురువులు సభామర్యాదను తెలిపినారు. సార్వభౌములు నూతనమర్యాదను స్థాపించినారు. ఇందు నాగొప్పదన మేమున్నది? రాజగురువుల

యెడ నేఁజూపిన యౌద్ధత్యమునకు క్షమాపణ వేడితిని. అంతియే!"

మహారాణి కీమెమాటలు విచిత్రముగనున్నవి. సార్వభౌములకుఁ గడచిన తేజము తుకాంబ జ్ఞప్తికివచ్చుటలోఁ గల రహస్యము నామె గ్రహించినది. ఆమెగుండె వేగముగ కొట్టుకొననారంభించెను. హృదయ మామెను 'నీవు దోషివి' అని యెత్తి చూపుచుండెను. రాణి కొంచెము ధైర్యవహించి "మీ నివాసము కొండవీఁడేనా?" అని ప్రశ్నించినది.

"చిత్తము."

"తల్లిదండ్రులు లేరనియు, మిమ్మొక వేశ్య పెంచినదనియుఁ బండితులు చెప్పినారు. నిజమేనా?"

"తల్లిదండ్రులెవరో నే నెఱుఁగను. న న్నొక వేశ్య పెంచినమాట వాస్తవమే!"

"మిమ్ము పెంచిన వేశ్యయున్నదా?"

"లేదు."

"ఆమె పేరు?"

"మంగమ్మ యని పిలిచెడివారు."

రాణి మనసు వికలమయ్యెను. ఒకవిధమైన పాపభీతి యామెహృదయము నావరించెను. తత్ఫలితము నాశించుచు నామె భయవిహ్వలయైనది. ఎట్లో మాటపెగల్చి— "అప్పుడప్పుడిచటికి రండు! మాటాడుకొనవచ్చును." అనినది.

"చిత్తము! సెలవు!"

రాణి యామెకు గొన్ని పూలు, పండ్లు, తాంబూలము నిచ్చి పంపినది.

విలాసిని వెడలిపోయినది. రాణిమనసు యోచనాతరంగముల నూగులాడుచుండెను. ఆమెకు తుకాంబ స్మృతిపథమున గోచరించినది. నేఁడామెరూపము రాణికి భయంకరముగనుండెను. ప్రతీకారేచ్ఛచే నామెకను లెఱ్ఱబడినట్లుండెను. మహారాణి కనులు మూసికొనినది. మానసికోద్వేగము పొంగి పొరలినది. తుకాంబ బ్రతికియున్నప్పుడు సాధించినది. చచ్చియు సాధించుచున్నది. ఇయ్యది యిరువురకును జన్మజన్మాంతరాగత వైరమేమో!

ఇంతలో రాణియాంతరంగికసఖి చంద్రలేఖ వచ్చినది. చంద్రలేఖకు ముప్పదివత్సరముల వయస్సుండును. ఈమె యీ యంతఃపురమునకువచ్చి పదునెనిమిదివత్సరములైనది. ఆమె రాకగూడ విచిత్రముగనే జరిగినది. ఈమెతల్లి కొండవీటిలో నుండెడిది. ఈమె కొండవీటిలోనే పెరిగి పెద్దదైనది. బాల్యమెచటగడచెనో యామె యెఱుఁగదు. ఈమె పంద్రెండవయేట తల్లి చనిపోయినది. పినతల్లి యీమెను విజయనగరము గొనివచ్చినది. ఈమెపినతల్లి మహారాణిపరిచారికలలోనొకతె. నాలుగైదు సంవత్సరముల కామెయు గతించినది. ఆపిమ్మట మహారాణులే యీమెను భరించిరి.

మహారాణి కీమెతల్లినిగూర్చిన విషయములు తెలియును. కాని యెన్నడును చంద్రలేఖతో నామెవిషయము

నెత్తలేదు. చంద్రలేఖ మహారాణివద్దకే తెంచినది—"అమ్మా! నేఁడేలకో విచారముగ నున్నారు?" అనెను.

"చంద్రా! కొండవీఁడెఱుఁగుదువా?"

"ఎఱుఁగకేమితల్లీ! నాబాల్య మచటనేగదా గడచినది!"

"కొండవీటిలో నీబంధువు లెవరైన నున్నారా?"

"లేరు."

"నీవెఱిఁగినవా రెవరైన నున్నారా?"

"నేనెఱిఁగియున్నమాత్రమునఁ బ్రయోజనమేమి? నన్ను వారెఱిఁగియుండవలెనుగదా! ఇంతకాలము గడచిన పిమ్మట నేను వారలకు గుర్తుందునా? ఐనను, వారు జీవించి యున్నారో లేరో!"

"ఆయూర మంగమ్మయను వేశ్యయున్నదని యెన్నఁడైన వింటివా?"

"మంగమ్మనా? ఆమె నెఱుఁగకేమి? ఆవాఁడలోనే మేమున్నది. నేను మంగమ్మత్త ఇంటికి ప్రతిదినము పోవుచుండెడిదానను. వారియింటియందొక పాపాయి యుండెడిది. ఆపిల్ల నెత్తుకొని యాడించెడిదానను. మాయమ్మయు నిత్యము వారి యింటికేఁగి యాపిల్ల నెత్తుకొనెడిది."

"అప్పటి కాపిల్ల కెంత వయసుండియుండును?"

"ఒక యేడాదివయసుండునేమో!"

"ఆపిల్ల మంగమ్మకుమార్తెయా?"

"కాదు ! ఆమెకు దొంఁకినదట.!"

రాణిగుండె జల్లుమనినది. ఇఁక సందేహములేదు. తా ననుకొనినది నిజమే ! ఆమెముఖము మఱింత విషాదాక్రాంత మయ్యెను. చంద్రలేఖకు మహారాణిమానసికవ్యథ అర్థము కాలేదు మహారాణి విచారభారమున తల్పము నాశ్రయించి నది.

విలాసిని యింటికేఁగునప్పటి కైదుగంటలు కావచ్చుచుండెను. నేఁడు గోపయామాత్యుఁడు రాజసభ కేఁగలేదు. అతఁడు వచ్చి నాలుగు దినములైనది. ఇచట నాతఁడు నిర్వర్తించుకొనవలసిన పనులు చాలయుండెను. అతఁ డుదయము నుండియు కరణములచేఁ లెక్కలు దయారుచేయించి కప్పమును రాజకోశమునకుఁ బంపెను. నాణెములు ముద్రింపించుటకై తెచ్చిన లోహములను టంకసాలకుఁబంపెను. ఈకార్యములన్నియు నిర్వర్తించుకొనునప్పటికి సూర్యాస్తమయము కావచ్చెను.

విలాసినియింటివద్ద గోపమంత్రికై ప్రతీక్షించుచుండెను. నేఁ డామెమనసు విశ్రాంతిని గోరుచుండెను. తాను విజయనగరమును జూడవచ్చినది. కాని యింతవరకు నాపని నెరవేరనే లేదు. ఇంతలో గోపమంత్రి యింటికి వచ్చినాఁడు. విలాసిని తన పురదర్శనోత్సుకతను బ్రదర్శించినది. గోపమంత్రియు విశ్రాంతినే కోరెను.

శకటము సిద్ధముగ నుండెను. ఇరువురును శకటము నధిరోహించి బయలుదేరిరి. గోపమంత్రి శకటచోదకునితోఁ

దుంగభద్రాతీరమునకుఁ గొంపోమ్మనెను. శకటము వ్యాస రాయాశ్రమమువద్ద కేతెంచినది. విలాసిని శకటము నాపించి నది. గోపమంత్రితో— "రాజగురువుల యాశ్రమమును దర్శించివత్తము రండు!" అనెను.

ఇరువురును ఆశ్రమద్వారముఁ జేరిరి. శిష్యుఁ డొకఁ డెదురువచ్చి వారలను లోనికిఁ గొంపోయెను. విలాసిని యాశ్రమ మంతయుఁ జూపించినది. ఆశ్రమవాతావరణము సాత్త్విక భావమును కల్గింపసమర్థమై యుండెను. ఇరువురును నొకగదిలోని కేఁగిరి. విలాసిని యాగదిలో దేవమందిరమున నున్న మురళీధరునిఁ జూపినది— "ఈయనయే నాప్రియుఁడు. ఆరాధ్యదైవము. ఇయ్యదియే మాయిరువురి క్రీడావిలాసభూమి. ఈయాశ్రమమే బృందావనము" అనుచు నామె యేమియో చెప్పదొడగెను.

ఆమె విచిత్రధోరణికి గోపమంత్రి లోలోన నవ్వుకొను చుండెను. ఇరువురును బయటకేతెంచి శకట మధిరోహించిరి. గోపమంత్రి యనినాఁడు— "ఆశ్రమమున నేదియో పాఠము మొదలిడినావే! అయ్యది మీగురువుల యుపదేశపాఠమా?"

"అవును! గురువులు నాకు కృష్ణభక్తి నుపదేశించి నారు. నావంటివారి కదియే సులభమార్గమట! ఈ యనంత విశ్వమునకంతకును ప్రేమాలంబన మీమూర్తియేనట! జీవు లన్నియు గోపికాస్వరూపిణులు! నిత్యము ప్రియుని విరహమున తపించునవే! ఏ రాధవంటి పుణ్యాత్ములకో గాని యాసౌందర్య

స్వరూపుని సంయోగము లభ్యముకాదట !" విలాసిని చెప్పుచునేయుండెను.

గోపమంత్రి యాశ్చర్యముతో విలాసినిమాటలను వినుచుండెను. ఆమెనైఖరిం జూడ నిజముగ కృష్ణవియోగానలసంతప్తయైన రాధవోలె నుండెను. శకటము కోదండరామాలయము మీఁదుగ విరూపాక్షాలయమువద్దకుఁ జేరినది. అప్పటికే చంద్రోదయమైనది. ఇరువురును కొలనిలో పాదప్రక్షాళన మాచరించి విరూపాక్షస్వామిని దర్శించిరి. దేవదర్శన మొనరించి మఱల రాజవీథిని బయలు దేరిరి. వీథులన్నియుఁ గలకలలాడుచుండెను. మార్గమునకిరువైపులను రతనాలయంగడులే ! నారీజన మాయంగడుల నిండియుండిరి. ఎటుఁజూచినను మార్గమునకిరుప్రక్కలను పూలదుకాణములే ! మల్లె, జాజి, విరజాజి, గులాబి, సంపెగ, మాలతి మున్నగు వివిధజాతుల పుష్పసౌరభముతో మార్గమంతయు గుబాళించుచుండెను. ఆసౌరభమునకుఁ దోడైనవి పుష్పలావికలమధుర భాషలచక్కిలిగింతలు. స్త్రీ పురుష విభేదములేక పూలకై యెగబడుచున్నారేలకో ! వీరికి భోజనముకంటె పూవులే మిక్కిలి యవసరములేమో! పురుషులు సైతము ముంజేతులను, మెడలందును పూలమాల లలంకరించినారు. తమ్ములము వేయనివారే కానరారు. ఆ జనసముదాయము కనులపండువుగ నుండెను.

హేమకూటముపై గాథాశ్రవణము జరుగుచున్నది. జనులు తండోపతండములుగ నచట మూగినారు. కథకుఁడు

తంబురవంటి వాద్యము నొకదానిని చేతఁగొనినాఁడు. లేతకావి రంగుధోవతి కట్టి గులాబిరంగుకూర్పాసము దొడిగి జరీయంచుగల తెల్లని శిరోవేష్టము జుట్టినాఁడు. నడుమునకు బంగారు నగిషీపూలుగల నల్లని వలిపెపొందు కట్టి దానికుచ్చులు క్రిందకు జారవిడిచినాఁడు. ఎడమచేతి వ్రేళ్ళకు రెండు గజ్జెలకడియము లున్నవి. వంతపాఠకులు సుమ్మేటములు వాయించుచున్నారు. ప్రధానకథకుఁడు లయానుకూలముగ నడుగువేయుచు పాడుచుండెను. రసానుగుణముగ నభినయించుచు కంఠధ్వనినిమార్చుచున్నాఁడు. ప్రేక్షకులు తన్మయులై వినుచుండిరి. విలాసినికి గాథాశ్రవణకుతూహలము కలిగినది. శకటము నాపించినది. కథకుఁడు పాడుచునేయున్నాఁడు—

"రాచనగరురక్షింపఁగ మంత్రితిమ్మరుసునుంచి
దండయాత్రకై మెండుగ భేరితాడనము తాటించి
అమరనాయకులు నల్లురల్లును రౌతులు రాహుత్తులును
కమ్మనాయకులు కటకంపువారలు వెంటరా పయనంచేసి
శివసముద్రము నొక్కనాటనే చేకొని చనుచుండి
శ్రీరంగంబున రంగనాయకుల భక్తిని భజియించి
రాయచూరు, ముదుగల్లును, ఆదవాని, పాలకి అద్దంకి
ఒక్కటొక్కటిగ చేతికి జిక్కఁగ నటు రాజ్యము లుంచి
గోలుకొండకు కోలాహలముగ సేనలసాగింప
వేవేగ మనేకులు వేగుల తెంచియు రాయలతో
శ్రీ మూరుగండరరాయ జయము!
వైరిగజరాజసింహప్రతాప జయము!

సాహిత్యసమరాంగణచక్రవర్తీ! జయము!
అవధరింపుమో దేవ! తురకలు పాళ్యంబుదిగినారు
కృష్ణవేణీమతల్లి కావలన్ జేరియున్నారు
గ్రామగ్రామాదులే కొల్లగొట్టుచున్నారు
పాతరల్ శోధించి ధాన్యముల్ గొంపోవుచున్నారు
పసులగొంపోయి కాసుకొక్కటిగ నమ్ముచున్నారు.

అని యీవిధంబున విన్నవింప రాయలవా రాగ్రహోద గ్రవ్యగ్రులై— ఆహా! ఎంతటిసాహసము! తురకలు కృష్ణ వేణీమతల్లి నుత్తరింపఁబూనుటా? ఈక ఱకుతురకల మొఱకు దనము నరికట్టి యరి నిరవశేష మొనరింపవలెనని నిశ్చయించు కొని, పెమ్మసానిపెదరామలింగనాయకుల రావించి—'నాయకా! వింటివా? తురకలు కృష్ణవేణీమతల్లినుత్తరింప డేరిజా వేసినా రట! కర్తవ్యమేమి'? అని ప్రశ్నింప రామలింగనాయకులు—

స్వామిముదలయేతడవుగ నే నట కేఁగి
తురకలడేరిజాత్రాళ్ళను తెగగొట్టి
తెలుగులకీర్తిని దిగ్దగంతముల తేజరిల్లజేసి
దేవర (శ్రీ) ప్రతాపవహ్నిలో శత్రుశలభముల గాల్చి
మగిడివచ్చి (శ్రీ)చరణాలకు మ్రొక్కుదు నిజము.

అని విన్నవించి, సార్వభౌముల యాజ్ఞగొని జయప్రస్థాన భేరి వేయించి, చతురంగబలసమేతులైపోయి, మదగజముపై కురుకు కొదమసింగమువోలె శత్రుసైన్యముపై కుఱికి—

మదమాతంగంబులతుండంబుల ఖండించి
మావటీల నీటెలతోఁ బెల్లుగ తెగఁ గ్రుమ్మి
దోసకాయల ట్లరిశిరముల నెగురగ వేసి
అరిహయములనెల్లను చాపచుట్టగాఁ బడవేసి
ముందుముందునకు ముక్కొనుచుండగ నసులు
తెలుగుల తెలికత్తులధాటికి తాళగలేక
బాపురె బాపురెయని గుండె బాదుకొనుచు
హతశేషులతోఁ జేరిరి గోలుకొండ విధిలేక”

శ్రోతలు వీరరసమున మునిగితేలుచున్నారు వారిలోఁ గొందరిచేతు లప్రయత్నముగ కరవాలములపైకిఁ బోయినవి. కాని, ఏవీ కరవాలము లచట? తాము గాథాశ్రవణ మొనరించుచున్నట్లు వారికప్పుడు స్పృహ కలిగినది.

శకటము బయలుదేరినది. ఇంటి కేఁగునప్పటికి పది గంట లైనది.

## ౨౪

గోపయామాత్యుఁడు విజయనగరము వచ్చినప్పటినుండియుఁ దన మేనమామయైన తిమ్మరుసుగృహమున కేఁగలేదు. నేఁ డాతఁడు మేనమామను, మేనయత్తను చూచిరావలెనని సంకల్పించుకొని బయలుదేరెను. అతఁడు విలాసినితో సాయంకాలమునకుఁ దిరిగివత్తునని చెప్పి శకటముపై బయలుదేరినాఁడు. అతఁడు మేనమామగారింటి కేఁగునప్పటి కాయన యింట లేఁడు. సభాభవనమునుండి యింకను రాలేదు. మేనయత్త గోపమంత్రిని పరామర్శించినది— "ఏమయ్యా! మాగడప పూర్తిగ త్రొక్కుటయే మానినావు? వచ్చి నాలుగైదు దినములైనను దర్శనమే లేకపోయె!"

"ఏనాటికానాఁడు రావలెననియే యనుకొనుచున్నాను. కాని వీలుపడలేదు. మామయ్యకుఁ గోపమురాలేదుగదా!"

"మామయంతటివాఁడైన అల్లునిపై నింకను కోపమేమిటి?

"నే నింతటివాఁడనగుట మామయ్య యాశీర్వచనమున గాదా? నేను రాలేదని మామయ్య యేమైన ననినారా?"

"లేదు. రాలేదనిమాత్ర మనుకొనినారు."

ఇంతలో గోపమంత్రికి వదినగారును, తిమ్మరుసుకొమార్తెయునైన తిరుమలాంబ వచ్చినది. మఱదిని జూచినది— "ఏమయ్యా! ఎప్పుడు రాక? దర్శనములేక అరుదైనవే!" అనినది.

"అవునుమఱి! దర్శనము లెట్లగును? మాయింటివద్ద నున్నగదా! కలిగినపుట్టినింటివారు దొఱకినారుగదా" యని చీటికిమాటి కిచటికే తెంచి కూర్చుందువు. నవరాత్రములు, సంక్రాంతి, చైత్రోత్సవము, అట్లతదియ, ఉండ్రాళ్ళతదియ ఎన్నిపండుగలు! ప్రతిపండుగకు పుట్టినింటికి ప్రయాణమేకద! మాఅన్నగారి నేమిచేసినావు?"

"మీకేనయముగదా! ఖర్చుతగ్గును! మీయన్నగారిని నేను కట్టివేసినానా? ఎక్కడికేఁగినారో!"

"వెంట గొనివచ్చినావన్నమాట! సామాన్యురాలవు కావు!"

"చాలులే నీవేళాకోళములు! సరియేగాని, మాచెల్లెలిని తీసికొని రాలేదేమి?"

"మీచెల్లెలు నావెంటవచ్చునా?"

"ఏమిమాటలవి?" అనుచు లోన నేడ్చుచున్న పిల్లవానిని గొనివచ్చి పినతండ్రియొడిలోఁ గూర్చుండబెట్టినది. పిల్లవాఁ డేడుపుమాని పినతండ్రివైపు జూచి నవ్వుచున్నాఁడు. తిరుమలాంబ యన్నది— "నాదెండ్లవారిపోలిక లెక్కడికి పోవును?"

ఇంతలో అప్పనమంత్రి లోనికేతెంచి— "ఏమది? మా వంశమునకే వొసరు పెట్టుచున్నావు?" అనినాఁడు.

"ఏమున్నది? మీపుత్రరత్నము! గంటనుండి యొకటే యేడుపు. పినతండ్రిగారొడిలోఁ జేరినంతనే మానినాఁడు. ఇఁక మేమందఱము పనికిరానివారమే కాఁబోలును!"

"పిల్లలకు స్వపరభేదము తెలియదు. కాని, ఎదుటివారి హృదయమును, స్వభావమును తేలికగ కనిపెట్టగలరు. మంచి వారివద్దకేగఁనప్పు డేడువరు." అని చిఱునవ్వు నవ్వెను.

"అందువలననే నాదెండ్లవారు మంచివారంటిని."

అప్పనమంత్రి తమ్ముని వెంటగొని గదిలోనికేఁగినాఁడు. అన్నదమ్ము లిరువురును కొలఁదిసేపు సంభాషించుకొనుచుఁ గూర్చుండిరి. ఇంతలో మహామాత్యులశిబిక ద్వారమువద్ద నాగినది. అప్పాజీవారు లోనికేతెంచినారు. గోపమంత్రి మేనమామకు నమస్కరించినాఁడు. "ఏమోయీ! మా యింటికి వచ్చుటయే మానినావు?" అనినాఁడుఁ తిమ్మరుసు.

"ఏనాటికానాఁడు రావలెననియే యనుకొనుచున్నాను. వీలు పడినదికాదు. క్షమింపుఁడు."

తిరుమలాంబ పాదప్రక్షాళనమునకు నీరు గొనివచ్చినది. "క్షమించుట కేమున్నదోయీ! అనుచు తిమ్మరుసు పాదప్రక్షాళనమున కేఁగెను. మరల లోనికేతెంచి— "నీవొక్కఁడవే వచ్చినావేమి? ఆమె యేది?" అనెను.

గోపమంత్రి మోము చిన్నవోయినది. మాటాడలేదు.

"మాయింటికేతెంచుటకుఁగూడ నభ్యంతరమున్నదా?"

"లేదు. క్షమింపుఁడు. పెద్దలవద్దకు... నేనే సాహసింపలేక పోతిని."

"పెద్దలవిషయమైన ఆలోచనము ముందేయుండవలెను. ఇప్పుడు సంకోచమేల? శ్రీపైనను వెంటగొనిరమ్ము!"

గోపమంత్రి మౌనముచే నంగీకారమును సూచించెను. తిమ్మరుసు మేనయల్లుండ్లతోఁగలసి భోజనమున కేఁగెను.

విలాసిని గోపమంత్రికొఱకు సాయంకాలమువఱకును బ్రతీక్షించినది. కాని గోపమంత్రి రాలేదు. ఆమె కేమియుఁ దోచలేదు. శకటచోదకునిఁ బిలిపించి యడిగినది. వాఁడు ప్రభువులు తనతో నేమియుఁ జెప్పలేదనినాఁడు. విలాసిని వానితో శకటమును సిద్ధముచేయుమని చెప్పినది. సమ్యగలంకృతయై బయలుదేరినది. నేఁడామెకు నాగలాంబాపురముఁ జూచి రావలెనని బుద్ధిపుట్టినది. శకటము మూడు ప్రాకారద్వారములను దాటినది. ఆ పిమ్మట మార్గమున కిరుప్రక్కలను ఫలభారమునవంగిన పండ్లతోటలే! కనుల కింపునింపుచున్న ఆకుతోటలే! పుష్పోద్యానములే! శకట మింకను రెండుప్రాకారములు దాటినది. మార్గమున కిరుగెలంకుల శాలిధాన్యక్షేత్రములు! శకటము నాగలాంబాపురముఁ జేరినది. విశాలములైన రాజవీథులు! నూత్ననిర్మితములును సమున్నతములును నైన భవనరాజములు పురలక్ష్మీశోభను సూచించుచున్నవి. పురమునకుమధ్య సార్వభౌములసౌధ మున్నది. పురమునుజుట్టి యొక పెద్దప్రాకార మున్నది.

నాగలాంబాపురము శ్రీకృష్ణదేవరాయసార్వభౌములు నిర్మింపనపట్టణము. సార్వభౌములు తమతల్లిపేర నాపురమును నిర్మింపఁజేసిరి. ఆ యభిమానమువలన ప్రభువు లానగరోన్నతికి సర్వవిధములఁ బ్రయత్నించిరి. నవరాత్రోత్సవములందును, ఇతర ముఖ్యావసరములందునుఁదప్ప సంవత్సరమున విశేష భాగము సార్వభౌము లీ నూతననగరముననే యుందురు. అందుచే నయ్యది రాజకీయోద్యోగులకుఁ బ్రధానకేంద్రమైనది. విలాసిని నగరమంతయుఁ దిరిగి చూచినది. విజయనగరవైభవ మామెకుఁ గన్నులఁ గట్టినట్లయినది. కాని, గోపయామాత్యులు వెంటలేకుండుటామెకు విచారమును గల్గించుచుండెను.

సూర్యాస్తమయము కావచ్చినది. శకటము గృహాభిముఖమైనది. విలాసిని యింటికేతెంచునప్పటి కేడుగంటలు దాటినది. గోపమంత్రియింకను రాలేదు. స్నానభోజనాదికములను ముగించుకొని వ్యాసరాయాశ్రమమునకు బయలుదేరినది.

రాజగురువు లింకను ఆశ్రమమునకు రాలేదు. విలాసిని మురళీధరుఁ డున్నగదిలోని కేఁగినది. దీపకాంతిముందు విగ్రహ సౌందర్య మినుమడించినది. తాను గొనివచ్చిన పూలమాలలచే నలంకరించినది స్వామిని. కృష్ణభగవానునకెదురుగ దర్భాసనమున పద్మాసనస్థ యైనది. శ్రీకృష్ణునిరాసలీలావిలాసము లామె మనోఫలకమునఁ బ్రతిఫలించినవి. రాధాకృష్ణుల ప్రణయకేళీ విలాసములు స్మృతిపథమున మెఱసినవి. కృష్ణప్రణయమునఁ దన్మయయైనది. క్రమముగ నామెయహంభావము నశించినది. రాధభావమున లీనమైపోయినది. ఆమెకు బాహ్యస్మృతి లేదు.

వ్యాసరాయలవా రాశ్రమమునకువిచ్చేసినారు. శిష్యుడు విలాసిని యోగమనవృత్తాంతమును గురువులకు నివేదించినాఁడు. గురువులు పాదప్రక్షాళనాచమనములగావించి గదిలోని కేఁగినారు. విలాసిని ధ్యానమగ్నయై యున్నది. గురువులయాగమనము నామె గుర్తింపలేదు. ఆమెకు బాహ్యస్మృతియే లేదు. ఆమెశరీరము నేలవ్రాలిన విషయమే యామెకుఁ దెలియదు. వ్యాసరాయ లామెను తదేకదృష్టితోఁ దిలకించుచుండిరి. ఆమె సుందరవదనారవిందమున శాంతభావము నూతనసౌందర్యజనకమైనది. మధ్యమధ్య యధరములు స్పందించుచుండెను. మోమున చిరునగవుల దొంతరలు కానవచ్చుచుండెను. శరీరము పులకితమై యుండెను. సౌందర్యమునందలిసంపూర్ణాకర్షణ మచటఁ జేరి తన ప్రభావమును వ్యక్త మొనరించుచుండెను.

ఇతరుల నాకర్షించి పాదదాసులనొనర్చుకొనువ్యక్తిత్వములందొకటి విలాసినివ్యక్తిత్వము. తనయందిట్టి శక్తి యున్నదని యామె యెఱుఁగదు. తనకుఁ దెలియనిస్థితియందే తానీశక్తినిఁ బ్రదర్శించుచుండును.

ప్రశాంతమహాసాగరమునఁ దుపానురాబోవుముందు గంభీరమైన నిస్తబ్ధత వ్యాపించును. ఆ సమయమున వాయుమండల ముత్తేజితమై, వాతావరణమంతయు రానున్న విప్లవాశంకతో శూన్యమైపోవును! ఆపిమ్మట? బ్రహ్మాండమైనవాయుప్రసారము! తరంగములతాండవనృత్యము!! విప్లవగానము!!!

గగనకక్ష్యపై జ్వాలాముఖి బ్రద్దలగుటకుపూర్వ మొక ఘోరమైన అశాంతి యణగియుండును. దాని నీలవర్ణము

ధూమిలమైపోవును. ప్రళయాంతకాలమున నాకాశమండలము వాయుశూన్యమై పోవును.

పిమ్మట? అగ్నికణములు! సర్వనాశనము!! మహాభైరవుని ప్రళయతాండవము!!!

మూడుదినములనుండి వ్యాసరాయలమనసు పూర్వస్థితినిఁ దప్పినది. ఆనాటివఱకును వారి శాంతి ప్రళయాత్పూర్వ ముందు నిస్తబ్ధత!

విలాసినిసౌందర్యమున కాతనిహృదయము నించుక సంచలించెను. గుర్తించినాఁడు. ఆత్మ పతనోన్ముఖమైనదని భావించి మనసును నిగ్రహింపఁ బ్రబలప్రయత్నము మొనరించినాఁడు. కాని సాధ్యము కాలేదు. యజమానియాజ్ఞను లెక్కచేయక విచ్చలవిడి సంచరించు గుఱ్ఱమైన దాతని మనసు. ఎప్పుడును తనకిట్టి విషమపరిస్థితి సంభవింపలేదు. నేఁ డీస్థితికిఁ గారణమేమి? ఆలోచించినాఁడు. ఆకర్షణము లేనప్పుడు తనకు చిత్తశాంతి యున్నది. ఆశ యెదుట లేనప్పుడు తనలోని లోభము సుప్తమై యున్నది. ఆ సుప్తమైయున్న కామమును, ఆశలను, లోభమును, అశాంతినిఁ గాంచి తాను పరిస్థితులను జయించితి ననుకొనినాఁడు. మనసు వశమైనదని భ్రమించినాఁడు. ఇంద్రియములు తనకు లోబడిపోయినవని మోసపోయినాఁడు. తన యథార్థస్థితి నేఁడు వ్యక్తమైనది. ఆశలుచావలేదు, కామము నశించలేదు. లోభము తన్ను వీడలేదు. అవి సుప్తములై యున్నవి. తా నవి నశించినవని భ్రమించినాఁడు. తన యేబదేడులవయస్సు కామము నరికట్ట జాలకపోయినది. తా నిడివఱలో ననుభవించిన భోగములు

తృప్తినీయ లేకపోయినవి. తా నొనర్చిన సాధన శాంతి నొసంగ లేకపోయినది.

చిరకాలసుప్తములైనకోరికలు నేఁడు జాగృతములైనవి. వాటియలసట పోయినది. పూర్వాధిక తేజము కలిగినది. యోగి తాళజాలకపోయినాఁడు. శరీరమును బలవంతముగ ప్రక్కగది లోని కీడ్చుకొనిపోయినాఁడు. అచట దర్భాసనముపైఁ గూర్చుండి యాలోచింప మొదలిడినాఁడు.

దేవదానవసంఘర్షణము ప్రారంభమైనది. రాగవిరాగములకు ఘర్షణము సంభవించినది. ధర్మాధర్మములకు, శాంత్యశాంతులకు, భోగయోగములకు, ఇహపరలోకములకు తుముల యుద్ధము! యోగి విక్షిప్తుఁడై పోయినాఁడు. వివేకము క్రియాశూన్యమైపోయినది. అచట కూర్చుండలేకపోయినాఁడు. మఱల ప్రక్కగదిలోని కేగినాఁడు. విలాసిని యట్లేయున్నది. సమీపించినాఁడు. మోమున మోము పెట్టి పిపాసితదృక్కులతో సౌందర్యపాన మొనరించుచున్నాఁడు.

విలాసిని కాత్మభావము నశించినది. తాను రాధ. తన ప్రియుఁడు రాధికాలోలుఁడు శ్రీకృష్ణుఁడు. తాను ప్రణయరసాధిదేవత. తనప్రియుఁడు రూపజితమన్మథుఁడు— రసజ్ఞశేఖరుఁడు. బ్రహ్మానందస్వరూపుఁడు. ప్రియునిచక్కలిగింతలకు పులకరించినది. ప్రియాశ్లేషరాగచుంబనములకు సొక్కినది. ప్రియునితోడి బృందావనవిహారముల సుఖించినది. కాళియమర్దనదృశ్యమును గాంచి భయమునఁ గనులు మూసికొనినది. గోపికలనుజూచి యీసు వెల్వరించినది. ప్రియునికొఱ కభిస

రించినది. మురళీధ్వని ప్రియాగమనమును సూచించినది. మెల్లగ బయలుదేరినది. కాళిందీతీరమున లతానికుంజము! ఆపూఁబొదరింట నెత్తమ్మిచిగురుటాకులపాన్పు! మలయమారుత మనుకూలమైనది. శీతకిరణుఁ డమృతకిరణములఁ గానుకవెట్టి యభినందించుచున్నాఁడు. ప్రియసమాగమసుఖమున సొక్కినది. ఆమెకు ప్రియునిలోని శ్రీకృష్ణభావము సన్నగ క్షీణించినది. శ్రీకృష్ణునిరూపము గోపమంత్రిరూపమును వెల్వరించుచున్నది. గోపమంత్రియే ప్రత్యక్షమైనాఁడు. ఆమెలోని రాధికాభావము మారలేదు. గోపమంత్రి చుంబనమునకు ముందుకు వంగినాఁడు. 'ప్రభూ!' అని కెవ్వున కేకవెట్టినది. ఆమెలోని రాధికా భావము మాయమైనది. కనులు తెఱచినది.

ఎదుట గురువులు మోమునమోమువెట్టి వీక్షించుచున్నారు. విలాసిని భయవికంపితయైనది— "స్వామీ!"యని మఱల కేకవైచినది. లేచినది. వ్యాసరాయలు వెనుకకు తగ్గినాఁడు. విలాసిని మఱల "స్వామీ!" యని పిలిచినది. వ్యాసరాయలు తలయెత్తలేదు. అవనతవదనుఁడై మెల్లగ ప్రక్కగదిలోని కేఁగినాఁడు. దర్భాసనముపైఁ గూర్చుండి విలపించినాఁడు. అతనికనులు పరితాపమున చెమ్మగిలినవి. తన యాత్మికపతనమున కాతఁడు వ్యథితుఁడైనాఁడు. తన సాధన, తన తపస్సు, తన యభిమానము, తన నిగ్రహము, తన సర్వస్వము నేఁడు నాశనమైనది. నేఁ డాతఁడు యోగికాఁడు—రాజగురువు కాఁడు— సామాన్యకాముకుఁడు! ఈయాలోచనముతో నాతఁడు కంపించిపోయినాఁడు.

ఇఁక విలాసినితో మాట్లాడు టెట్లు? ఆమెను మొగ మెత్తిచూపఁగలఁడు? తన గురు వింతటి యింద్రియలోలుఁ డని గ్రహించిన విలాసిని ముం దిఁక తన కేమిగౌరవము? అతఁడు నారీరూపముననున్న శక్తిని బాగుగ నెఱుఁగును. అందువలననే యాతఁడు స్త్రీకి దూరమై తిరిగినాఁడు. అగ్నిమధ్యముననుండి చల్లదనమునకుఁ బ్రయత్నించుటకంటె అగ్నికి దూరముగ నుం డుటయే మంచి దనుకొనినాఁడు. కాని యాయగ్నియే తనవద్ద కేతెంచి తన సర్వస్వమును భస్మ మొనరించినది. ఇందులకుఁ బ్రతీకార మేమి? వ్యాసరాయలు బాలునివలె విలపించినాఁడు.

గురువులస్థితి విలాసిని కర్థముకాలేదు. ఆమెకుఁ దన స్థితియే సరిగ తోచుటలేదు. తా ననుభవించినవిషయములు సత్యములా? లేక స్వప్నములా? తనయనుభవముల కర్థమేమి? గురువుల నడుగదలఁచినది. కాని గురువులు మాటాడక వెడలి పోయి రేలకో? ఆమెకప్పుడు తాను ధ్యానప్రబుద్ధయైన సమ యమున గురువులచూపు జ్ఞప్తికివచ్చినది. ఆ యయోమయ స్థితి యందు 'స్వామీ!' యని యఱచినది. అందులకై గురువులు కోపగించినారా?

విలాసిని మెల్లగ ప్రక్కగదిలోని కేఁగినది. వ్యాసరా యలముఖము గంభీరమై యుండెను. విలాసిని గురువులకు నమ స్కరించినది. వ్యాసరాయలు మాటాడలేదు. ఆయన కనుల నుండి స్ఫులింగములు రాలుచుండెను. విలాసిని భయవికంపిత యైనది. 'స్వామీ!' యని చరణముల వ్రాలినది. వ్యాసరా యలు వెనుకకుఁ దగ్గినాఁడు—'విలాసినీ!'

"ప్రభూ !"

ఏమనవలెనో వ్యాసరాయలకుఁ దోఁచలేదు. ఆవేశమున ననినాఁడు— 'నీవిచటి కేలవచ్చితివి ?'

"గురువులవద్ద దీక్షాస్వీకారమునకు"

"విలాసినీ ! యదార్థముఁ జెప్పమందువా ?"

"చిత్తము !"

"నేను నీకు దీక్షనొసంగుట కనర్హుఁడను. ఇక పొమ్ము!"

విలాసినికి గురువులమాట లర్థముకాలేదు. ఏమనవలెనో తోఁచలేదు. అప్రయత్నముగ నీమాటలు వెలువడినవి— "స్వామీ !- నావలన నేమైన నపరాధము జరిగినదా ? దాసురాలిపై దయ రాలేదా?"

"నిన్నొక్క విషయ మడుగఁదలఁచినాను. యదార్థము వచింతువా?"

"గురుచరణములాన."

"నీవు ప్రభూ, యని యేల అఱచితివి?"

విలాసిని తనయనుభవమును గురువులకు నివేదించినది. వ్యాసరాయ లాశ్చర్యచకితుఁ డైనాఁడు. మఱల ప్రశ్నించినాఁడు— "స్వామీ ! యని కేక వేయుటలో నీ యుద్దేశ్య మేమి ?"

"ప్రభూ ! ఆ యయోమయస్థితియందు మిమ్ముచూచి భయపడితిని. తమదృష్టి నాకు భయకారణమైనది."

"సత్యమువచించినావు. విలాసినీ! నీవు నిక్కముగ ప్రణయరసాధిదేవతవు. ఏదియో పూర్వజన్మసంగపరిహారార్థము వేశ్య వైనావు. లోకపుదృష్టిలో నీవు వేశ్యవు కావచ్చును. కాని నీవు పతివ్రతాశిరోమణివి. నీహృదయమున గోపమంత్రికేగాని తదితరులకు స్థానము లేదు. నాయుపదేశములవలన శ్రీకృష్ణునకు హృదయమున స్థాన మిచ్చినావు కాని అయ్యది కల్పితము ! అందువలననే శ్రీకృష్ణపరమాత్మరూపము నీ హృదయమున నిలువలేదు. మరల గోపమంత్రియే భాసించినాఁడు. నీరాధికాభావ మింకను దొలగకుండుటచే 'ప్రభూ!' యని కేకవేసితివి. నీకుపదేశమొసంగుట కనర్హుఁడనైనను నా యీ యుపదేశమునుమాత్రము గ్రహింపుము ! నీకు భర్తయే దైవము ! నీ ప్రియుఁడైన గోపమంత్రికిని కృష్ణపరమాత్మకును భేదములేదు. ఈయభేదబుద్ధితో నాతనిని భజింపుము. అదియే నీకు కల్యాణదాయకము.

ఇఁక నావిషయము. ! యదార్థమును నీవద్ద దాచను. భౌతికసుఖము లశేషమనుభవించితిని. సన్యసించితిని. లోకమునకు దూరముగనుండి పరబ్రహ్మసాధన చేయదలఁచినాను. ఆకర్షణములేదుగాన నానిగ్రహ మిన్నినాళ్ళు నిలిచినది. నిగ్రహమునకు బదులు నారీద్వేష మలవఱచితిని. ఆభావములే ప్రథమదివసమున రాజసభలో నీకుఁ గాన్పించినవి. పరిస్థితులకు దవ్వుననుండి యింద్రియములను జయించితినని భ్రమించితిని. నేఁడు నీసౌందర్య సమక్షమున పరాజితుఁడ నైతిని. నా యిన్ని దినములసాధనయు బూదిఁగలసినది. ఏనాటి దుష్కృతమో నేఁ డీవిధమున బరిణ

మించినది. మనయిరువురికి నేనాటిపగయో నేటితోఁ జెల్లినది. విలాసినీ! ఇఁక నీవు శిష్యురాలవు కావు. నేను గురువను కాను. నేఁ జెప్పినమార్గమున గోపమంత్రిని సేవింపుము. నీకు, గల్యాణ మగుగాక!" అని వ్యాసరాయలు చరచర బయటకేఁగెను.

విలాసిని మెల్లగ బయటకేతెంచినది. ఆమెబుద్ధి పని చేయుటలేదు. శకట మచటనే యున్నది. కింకర్తవ్యతామూఢయై పోయి శకటమునఁ గూర్చున్నది. శకటము బయలు దేఱినది. భవనమున కేఁగి చూచినది. ఇంకను గోపయామాత్యుఁడు తిఱిగిరాలేదు. ఆమెమనసంతయు వికలముగ నుండుటచే శయనగృహములోని కేఁగి తల్పమున మేను వాల్చినది. అప్పటికే పదునొకండుగంటలు దాటెను. ఆమెమనసంతయు విక్షిప్తమై పరిపరివిధముల నాలోచించుచుండెను. తాను వ్యాసరాయలయాశ్రమమున కేఁగుటయేల? ధ్యానావస్థయందు గోపమంత్రి సాక్షాత్కారమగుటయేమి? నేను రాజగురువుల పతనమునకుఁ గారణమనగుటయేల? విధివిధానము! గోపయామాత్యులు ముందే చెప్పినారు—— ఇతరుల సాధనా క్షేత్రమున నడుగిడుట మంచిదికాదని. ఆ వాక్యము లప్పుడు నాకు రుచింపలేదు. లోకమును బాగుగ గుర్తించిన యామహాపురుషునకు ముందే తెలిసియుండును. అగుచో నన్నేల బలవంతముగ నాపలేదు? వారించియుఁ బ్రయోజన ముండదని భావించియుందురు. విలాసినికి గోపమంత్రియెడల శ్రద్ధాభావ ముదయించినది. క్రమముగ నయ్యది భక్తిభావముగ రూపాంతర మందినది. గోపయామాత్యుల దర్శనమున కామెహృదయము పరితపింపసాగెను.

ఇంతలో శిబిక ద్వారము వద్ద కేతెంచినధ్వని యైనది. ద్వారరక్షకులు తలుపులు తెఱచినారు. విలాసిని గదినుండి యీవల కేతెంచి చూచినది. విలాసినికనులనుండి రెం డశ్రు బిందువులు చెక్కిళుల నందగించినవి. "విలాసినీ! నీవింకను నిదుర పోలేదా?" యని గోపమంత్రి పరామర్శించినాఁడు.

"ప్రభువులకై ప్రతీక్షించుచున్నాను."

ఇరువురును శయ్యాగృహమున కేఁగిరి. గోపమంత్రి తల్పమున నాసీనుఁ డైనాఁడు. విలాసినిమోమున నేఁ డొకవిధ మైన జంకుకానవచ్చుచున్నది. గోపమంత్రి విలాసిని నాహ్వా నించినాఁడు. అప్రయత్నముగ నామెహృదయ ముప్పొంగినది. అశ్రువులు ధారలుకట్టినవి. వెక్కివెక్కి రోదించుచున్నది. గోప మంత్రి కామెస్థితి యర్థము కాలేదు. ఆమెను బుజ్జగించుటకు లేచినాఁడు. ఆమె గోపమంత్రిపాదములపై వ్రాలినది— "ప్రభూ! క్షమింపవలెను! అపరాధముజరిగినది" అనినది.

గోపమంత్రి కేమియు నర్థముకాలేదు— "విలాసినీ! నీవలన నెన్నడును నపరాధ మనునది జరుగదే! క్షమాపణ యేల? దేనికింత బేలవైతివి?"

"ప్రభూ! నావలన నపరాధము జరిగినది."

"అపరాధమునకుఁ బశ్చాత్తాపమే చాలును. ఇఁక క్షమాపణలేల? ఏమిజరిగినది?"

విలాసిని జరిగిన విషయమంతయుఁ బూసగ్రుచ్చినట్లు నివేదించినది.

గోపమంత్రిమోమున మందహాసము చెంగలించెను— "విలాసినీ! నేను ముందే చెప్పితినిగదా! ఇందు నీదోషము లేదు— రాజగురువులదోషమును లేదు. ఇయ్యది ప్రకృతి ధర్మము. పరిస్థితు లట్లొడగూడినవి. రాజగురువులే కాదు— ఆపరిస్థితియందెవరైనను నట్లే ప్రవర్తింతురు. ఆపరిస్థితులను కల్పింపనేకూడదు. బ్రహ్మాండమున గోళము లన్నియుం దమ కక్ష్యలందు తిరుగవలె. గ్రహములు తమకక్ష్యలను దప్పి చరించి నచోఁ బ్రళయమే సంభవించును. మానవుఁడును నంతియే! తనమార్గమును వీడియితరుల క్షేత్రమున పదార్పణ మొనరింపఁ గూడదు. మానవుఁడు పరిస్థితులకు దాసుఁడు. నేను ముందు చెప్పినను, పరిస్థితులు నిన్ను బ్రోత్సహించినవి. అనధికారక్షేత్ర మున నడుగిడితివి. రాజగురువులును నిన్ను దగ్గఱకుఁజేర్చి పొఱపాటొనరించినారు. ఇరువురును మీమీ మార్గములనుండి చ్యుతులైనారు. రాజగురువుల పతనమునకుఁ గారణ మదియే! కాని యిరువురును నదృష్టవంతులే! పరిస్థితులకు వశులై యధో గతికిఁబోకుండ తప్పుకొనినారు. ఆత్మపతనమును గుర్తించి వెను కకు మఱలుట రాజగురువులచరిత్రకు శోభ గూర్చినది. పరి స్థితులకు వశీభూతవై శీలమును భ్రష్టమొనరించుకొనక నీవును తిరిగి సరియైనమార్గమున కేతెంచితివి. ఆ యోగీశ్వరునిపతనము నకుఁ గారణభూతురాలవు కాకుండ తప్పుకొనుట నీచరిత్రకు విలువఁదెచ్చినది. ఇయ్యది శుభాంతమే! దీనికై వగవఁబని లేదు." అని ప్రభు వామెను దగ్గఱకు దీసినాఁడు. విలాసిని హృదయము సగద్గదమై గోపమంత్రికి ఆత్మసమర్పణము గావించికొనినది.

---

•

## ౬

విలాసినిని జూచినప్పటినుండియు మహారాణిహృదయమున బాధ యెక్కువయ్యెను. తుక్కాంబ తనపైఁ బగపూనియున్నట్లామె మనసులోఁ గలవరము బయలుదేరెను. తుక్కాంబను సార్వభౌములు పరిత్యజించుటకు, తానును రాజగురువులును గొంతవఱ కామెనిర్వాసనమునకుఁ గారకులని యామెహృదయము మాటిమాటికిని సూచించుచుండెను. ఈభావనతో నామెకుఁ దుక్కాంబ ప్రతీకారవాంఛతో భయంకరరూపమున బ్రత్యక్షమగుచుండెను.

తాను సార్వభౌములతో తుక్కాంబపై గొన్ని నేరములు చెప్పినది. సార్వభౌములుగూడ బాగుగ విచారణసల్పినారు. తుక్కాంబ గర్వము ప్రభువులకే యనుభవమునకు వచ్చినది. ఆమె రూపగర్వము, సవతిమచ్చరము, బాగుగ పెఱిగినపిమ్మట నే ప్రభువు లామెపైఁ గోపించినారు. తా నామెను పరిత్యజింపుఁడని సార్వభౌములతో జెప్పలేదు. ప్రసంగవశమున రాజగురువులే యనినారు—యామె తండ్రియరణముగ నొసంగిన కంభమునకుఁ గొన్నినాళ్లు పంపినచో బాగుండునని. ఆ ప్రస్తావనము సార్వభౌములకును నచ్చినది. ఇందుతన తప్పేమున్నది ?

ఈవిధముగ తనహృదయమును సమాధానపఱచుకొనుటకు యత్నించినది. కాని మఱుక్షణముననే మఱియొకభావము వచ్చి నీవే దోషివని నిరూపించుచున్నది. తుక్కాంబ గర్భవతి

యని తా నెఱుఁగును. బయటకు పోక్కనీయక తానే పరిచారి కలనోరులు కట్టివైచినది. ఆనాఁడే రాయలకు తుక్కాంబ గర్భవతియైయున్నదని తెలిసినచో నేమొనర్చియుండెడివారో! ఆమె చనిపోయినను పిల్లనైనను దెచ్చి పెంచెడివారేమో! తానొనర్చిన మహాపరాధమువలననే విలాసినికి తల్లి లేకుండపోయినది. తానొనర్చిన దుష్కృత్యమువలననే తండ్రియెవరో తెలియక వేశ్యకావలసివచ్చినది. తానొనర్చిన మహాపాపమువలననే తండ్రికీమె తనకుమార్తెయని తెలియకుండపోయినది! తానొనర్చిన యీయకార్యమునకుఁ దానెట్టి ఫలితములింకను ననుభవింపవలసియుండునో! నేఁడు సార్వభౌముల కీవిషయము తెలిసినచో వారెంతదుఃఖింతురో! నాపై నెంత కోపగింతురో! మహారాణి కీయాలోచనలతో చిత్తస్థైర్యము పూర్తిగా నశించినది. గడచిన రాత్రియంతయు హృదయమున తుపాను రేగుచునేయుండెను. మధ్యలో నొక కునుకుపట్టినది.

"సార్వభౌములు తన యంతఃపురమునకే తెంచినారు. వారొక బాలుని గొనివచ్చి తనయొడిలో నుంచినారు. తా నాబాలుని ఱొమ్మునకుహత్తుకొనినది. ప్రభువులామెకపోలముపై నొక చిటికవేసి చిరునవ్వునవ్వినారు. బాలు నొకసారి ముద్దిడుకొని ప్రక్కగదిలోనికేఁగి శయనించినారు. తాను బాలునకు పాలిచ్చి నిద్రపుచ్చినది. బాలుఁడు నిదురించినపిమ్మట తాను ప్రక్కగదిలోనికేఁగి ప్రభువులపాదములవద్ద జేరినది. ఇంతలో బాలుఁడు కెవ్వునకేకవేసినాఁడు, ప్రక్కగదిలోనికేఁగి చూచినది— ఒక భయంకర పిశాచము! బాలుని మెడబట్టి విక్ర

త్తాట్టహాసము గావించుచున్నది. తా నాపిశాచమును ప్రతి మాలినది. రోదించినది. కాని పిశాచమునకు దయరాలేదు. వికృతహాసము మఱింత వికృతమైనది. బాలునిమెడపట్టి పిసికి వేయుచున్నది. బాలుఁడు 'అమ్మా' యని కేకవేసినాఁడు. అదృశ్యమును గాంచలేక దుఃఖముతోఁ గనులకు, జేతు లడ్డము పెట్టుకొనినది. బాలుఁడు మఱల 'అమ్మా!' యని కేకవేసినాఁడు. చూచినది. మాతృహృదయము పొంగినది. దుఃఖమున సాహసము జనించినది. పిశాచముతోఁ గలియఁబడినది. కాని ప్రయోజనము లేకపోయినది. భూత మామె నావలికి నెట్టివేసినది. బాలునిమెడ పిసికివేయుచున్నది. బాలునినోట మాటగూడ పెగలివచ్చుటలేదు. గ్రుడ్లు బయటకు వచ్చుచున్నవి. రాణికి దుఃఖముతోఁబాటు కోప మధికమైనది. స్పర్థ తీవ్రమైనది. ప్రక్కగదిలోని కేఁగినది. భర్తప్రక్కలోనున్న మఱియొక బాలుని గొనివచ్చినది. పిశాచము మఱల రాణిని వెంబడించినది. రాణికి భయముకలిగినది. భూతము మీఁదికి దుముకుచు బాలునికొఱకు వెంబడించుచున్నది. రాణికి పరుగిడుటకుఁ గాలాడుటలేదు. 'అయ్యో! నాబిడ్డఁడు' అని కెవ్వున కేకవేసినది. అట్లే పోయిపోయి భర్తయొడిలో వ్రాలినది. ఉలికిపడి లేచినది. శరీరము వడకుచున్నది. తానుగాంచినది స్వప్నము! ప్రక్కన భర్త లేఁడు. ఎంతభయంకరమైన స్వప్నము! రాణి గుండె వేగముగ కొట్టుకొనుచుండెను.

మహారాణి కేక విని ప్రక్కనున్న చంద్రలేఖ మేల్కాంచి

యామెవద్ద కేతెంచినది—'అమ్మా! ఏమది? అట్లు కేకవైచితి వేల ?" అని యడిగినది.

"చంద్రా! భయంకరస్వప్నము. తలచుకొనిన గుండె జలదరించుచున్నది. దగ్గఱకు రమ్ము!"

చంద్రలేఖ దగ్గఱకు వచ్చినది. రాణి యామె నాలంబన మొనర్చుకొనినది. మహారాణిశరీర ముడికిపోవుచుండెను. శ్వాస వేగముగ నుండెను. గుండె యదరిపోవుచున్నది. చంద్రలేఖ రాణి నాశ్వాసించినది. ద్రాక్షరస మందించినది. కొంతసేపటికి మహారాణి తెప్పరిలినది.

"అమ్మా! ఏమిటాస్వప్నము ?"

రాణి భయముతో స్వప్నవృత్తాంతమంతయుఁ జెప్పినది. "చంద్రా! సందియములేదు. తుక్కాంబ భూతమై నన్ను వెంబడించుచున్నది. ప్రభువును వెన్నాడుచున్నది. నాబిడ్డను పొట్టనబెట్టుకొన్నది. నాకు పుత్రసంతానములేకుండ నాకడుపున చిచ్చురగిల్చినది. నాప్రభువులను వేధించుచున్నది. బ్రతికియు న న్నేడ్పించినది. చచ్చియు నాపైఁ బగ మానలేదు. నాసంతానమును బ్రతుకనీయదు. అది బ్రహ్మరాక్షసి. నాసర్వమునాశనము చేసితీరును. ఏమిచేయవలెనో తోచకున్నది. ప్రభువులను నిత్యే పీడించుచున్నది."

"అమ్మా! ఊరడిల్లుఁడు. రేపు రాజగురువులను బిలిపించి ప్రతీకార మాలోచింతము."

తెల్లవారినది. రాణి రాజగురువులకుఁ గబురుపంపినది. పూజావిధులైన పిమ్మట వత్తునని కబురుపంపినారు రాజగురువులు. మహారాణికి రాజగురువులపై విశ్వాస మెక్కువ. అనేక సమయములం దాయన తనపక్షమువహించి సార్వభౌములకు సలహా లిచ్చినారు. వా రుండబట్టియే యీనాటికిని చిన్నాదేవి యెదుట తా నుండగలుగుచున్నది. నేటికిని సార్వభౌములకుఁ దనపైఁగల యాదరాభిమానములను పెంపొందింపజేయుచునే యున్నారు. తుక్కాంబవిషయమునగూడ రాజగురువుల సాయము మహారాణికి లభించినది.

అప్పటికి మహారాణికొక కొమరుఁ డున్నాఁడు. మూడేండ్లవయస్సు. సార్వభౌములకుఁ గ్రొత్తగవచ్చిన తుక్కాంబపై మోజు తగ్గలేదు. తుక్కాంబ యానాఁడు మహారాణికి ప్రతిస్పర్థినియై నిలిచినది. తుక్కాంబ గర్భవతియైనదనువిషయము రాణికి భయకారణ మైనది. తుక్కాంబ యచటనుండుట తనకు, తనపుత్రునకు క్షేమముకాదని భావించినది. తుక్కాంబవలె మహారాజును లోఁగొను చాకచక్యముగాని, సౌందర్యముగాని తనవద్ద లేదు. తనకున్నది పట్టమహిషీపదము మాత్రమే !

క్రమముగ మహారాజులకు తుక్కాంబపై మోజు సన్నగిలినది. తుక్కాంబకు గర్వ మధికమైనది. సార్వభౌముఁడు తనకు వశవర్తి. ఆయనవలన సంతానప్రాప్తియుఁ గలుగనున్నది. తుక్కాంబ మిగిలినరాణులను లెక్కసేయలేదు. సవతులమధ్య స్పర్థలు పెఱిగినవి. మహారాణి తనకుమారునిపుట్టినరోజున తుక్కాంబకుఁ గబురుపంపినది. తుక్కాంబ రాలేదు. మిగిలిన

రాణులందరును వచ్చి యుత్సవమునఁ బాల్గొనినారు. మహారాణి కియ్యది యవమానకరమైనది. భవిష్యత్తున నిక తుక్కాంబతో తా నెదుర్కొనవలసిరాగల ప్రమాదము లామెమనోవీథిని పొడసూపినవి. సార్వభౌములతో నామె ప్రవర్తనమునుగుఱించి నివేదించినది. సార్వభౌములకుఁగోపము వచ్చినది తుక్కాంబపై- 'లేక లేక కలిగిన పుత్రసంతానము! యువరాజనోత్సవమునకుఁ బిలిచినను రాకుండుటలో నర్థమేమి? మహారాణిని, తనను, యువరాజును అవహేళనచేసినట్లు కాదా? సామాన్యురాలైన తుక్కాంబకు మహారాణితో స్పర్థయా? యువరాజుతో స్పర్థయా?' సార్వభౌముల కావేశము కలిగినది. 'ఆమెను శిక్షించియేతీరవలెను' అని నిశ్చయించుకొనినాడు.

ఇంతలో వ్యాసరాయ లచటి కేతెంచినారు. మహారాణులు తెరలోనికేఁగినారు. ప్రస్తావవశమున సార్వభౌములీయంతఃపుర కలహములనుగుఱించి రాజగురువులకు నివేదించినారు. రాజగురువు లౌదార్యమును ప్రదర్శించుననినారు— 'ప్రభూ! ఆడువారిపై నంతకోపము పనికిరాదు. కొంతకాలము పాటు తుక్కాంబగారిని వారితండ్రిగారి యింటికి పంపినచో కొలఁదిరోజులలో పరిస్థితులు చక్కబడగలవు."

ప్రభువుల కీ యుపాయము నచ్చినది. అట్లే యొనర్చినారు. మహారాణిబెడద తీరిపోయినది.

ఆనాఁడు రాజగురువులే సాయమొనర్చినారు. ఈనా

డును తన నీవిపత్తుండి రాజగురువులే రక్షింపఁగలరని రాణి భావించినది.

ప్రాతఃకాలపూజావిధులైనపిమ్మట రాజగురువులు రాణి వాసమునకు బయలుదేరినారు. వారిమనసు వ్యగ్రమై యుం డెను. నేఁడు వారిమోమున పూర్వపుతేజస్సు కానవచ్చుట లేదు. విచారభారాక్రాంతమైనట్లు వారివదన మవనతమై యుండెను.

పరిచారిక రాజగురువులయాగమనమును మహారాణి కెఱింగించినది. మహారాణి గురువులకొక యాసనము వెట్టించి నది. ఆమె యొక బంగరుజలతారుతెరమాటున గూర్చుండి యున్నది. రాజగురువులు లోని కేతెంచినారు. రాణి తెర మాటుననుండియే యన్నది... "గురువర్యులకు నమస్కా రము !"

వ్యాసరాయలు మహారాణి నాశీర్వదించి యాసనముపై నాసీనులైనారు. మహారాణినుద్దేశించి యనినారు— 'మహా రాణులకు నావలన నేమైనకావలసిన ప్రయోజన మున్నదా ?"

"అవును."

"ఆ ప్రయోజనమెద్దియో సెలవిండు. నావలననగుచో ప్రయత్నింతును."

రాణికి రాజగురువులమాటలందు పూర్వపుఉత్సా హము గోచరింపలేదు. వా రన్యమనస్కులై యున్నట్లామె గ్రహించినది—

"రాజగురువు లుత్సాహముగ లేరు. అన్యమనస్కులై యున్నట్లున్నారు. కారణమేమియో !"

వ్యాసరాయలు ప్రబుద్ధుఁ డైనాఁడు. ఉత్సాహమును దెచ్చుకొనినాఁడు— 'మహారాణుల నియోగమున నుత్సాహము లేకపోవుటేమి? సెలవిండు.'

"రాత్రి మాకొక పీడకల వచ్చినది. తత్పరిహారమునకై రాజగురువులసలహా నర్థించుచున్నాము."

"ఆ దుఃస్వప్న మెట్టిది ?"

రాణి స్వప్నవృత్తాంతమును నివేదించినది. వ్యాసరాయలాశ్చర్యపడినాఁడు. రాత్రి తా నేదియో యజ్ఞాతపాపమునకు ఫలితము ననుభవించినాఁడు. తన నొక మహాపాతక మావరించి పతితు నొనరించినది—మార్గభ్రష్టు నొనరిచినది. మహారాణి నొక ఘోరపాతక మావరించినది. ఆపిశాచకృత్యముల కర్థమేమి? రాణి యాశంకించినదే సత్యము. తుకా్కాంబ కామె యొనర్చిన మహాపరాధమున కిది ఫలము. తుకా్కాంబకు భర్తృవియోగమును కలిగించినది. తాను పుత్రవియోగ మనుభవించినది. కాని, సార్వభౌములు తుకా్కాంబను పరిత్యజించుటలో దోషమంతయుఁ గేవలము రాణిది కాదు— సార్వభౌముని దియు కాదు. అందు తనకును భాగ మున్నది. ఆపాపమున కింకను తా నెట్టి ఫల మనుభవింప వలసియుండునో ! రాజగురువులహృదయము భయకంపితమైనది. నేటివఱకుఁ దా నొనర్చిన యకృత్యమునుగుఱించిన యాలోచనము కలుగలేదు. నేఁడు

మహారాణిదుస్స్వప్నము, తన ప్రస్తుతపాపశంక, అతనికిఁ దుకాంబను జ్ఞప్తికిఁ దెచ్చినవి. తుకాంబ రాజకుమారుని మ్రింగినట్లే నాకుఁగూడ నేమైన నపకారముఁజేయునా ?

ప్రయత్నమున నెలుఁగు నూల్కొల్పినాఁడు— 'మహారాజ్ఞీ ! మనరోజులు మంచివికావు. తుకాంబ ప్రతీకారము నకుఁ బూనినది. ఏమగునో తెలియదు."

"నేనును నట్లే యనుకొనినాను. మీకును నట్లే తోఁచి నదా ?"

"అవును ! బాలుఁడు గతించి షుమారు పదునైదువత్స రములు కావచ్చినది. ఆవయసున మీ కీయూహ పోలేదు. నేఁడు తేలిపోయినది. సార్వభౌములకు దత్తత చేసుకొనవలెనను సంకల్పమేమైన నున్నదా ?"

"సార్వభౌములకు లేదు. నాకే యాయుద్దేశ్య మున్నది. గాని ప్రభువులే యంతగ నిష్టము చూపుటలేదు.''

"మహారాజ్ఞీ ! మీరొకవేళ దత్తత చేసికొనినను, ాబాలునిగూడ మిగులనీయదని స్వప్నవృత్తాంతమువలనఁ దేలు చున్నది.

"ఇందులకు ప్రతీకారమేమైన నున్నదా ?

"ఆలోచింపవలెను.''

"మ త్రియొకవిషయము !

"చిత్రము !"

"మీరు విలాసినిని జూచినారా?"

రాజగురువు లులికిపడిరి— "చూచినాను."

"మీరు తుకాంబనెన్నఁడైనఁ జూచినారా?"

"లేదు."

"విలాసినివిషయము మీకేమైనఁ దెలియునా?"

రాజగురువులగుండె వేగముగఁ గొట్టుకొనుచున్నది— "లేదు. ఆమె వేశ్యయనియు, గోపమంత్రికి ప్రేయసియనియు నెఱుఁగుదును"

"ఆమె వేశ్యకాదు."

"మఱియెవరు?"

"తుకాంబకుమార్తె"

రాజగురువుల ప్రాణము లెగిరిపోయిన ట్లయ్యెను. తుకాంబ కుమార్తెయా? ఈవిషయమును దలఁచుటకే రాజగురువులకు భయముగనుండెను. సాహసించి యడిగినాఁడు— "తమకెట్లు తెలిసినది. పొఱపాటు వినినారేమో?"

"కాదు! యదార్థమే! ఆమెను చూచిన నాటినుండియు ప్రభువు లనుమానముతో నన్యమనస్కులై మనసులో బాధ పడుచునే యున్నారు. నే నామెను పిలిచి మాటాడితిని. సందేహములేదు. ఆమె తుకాంబ కుమార్తెయే! నావద్ద నిదర్శనములున్నవి."

వ్యాసరాయుల పాదముల క్రిందనున్న భూమి తొలఁగి పోవుచున్నట్లుండెను. తుకాంబ రాణిపై, తనపై ప్రభువుపై

ప్రతీకారమునకుఁ బూనినది. జడునివోలె రెండునిముసము లట్లే కూర్చుండినారు. ఏమనుటకును, దోచుటలేదు.

మహారాణి యనినది.— "ఈవిషయము సార్వభౌముల తోఁ జెప్పిన నేమందురో! వారిదుఃఖ మినుమడించునేమో! చెప్పకున్న సంకెట్టి లిడుములఁ గుడువవలసి వచ్చునో!"

వ్యాసరాయ లుత్తేజితుఁడైనాఁడు— "సార్వభౌము లకుఁ జెప్పియేతీరవలెను. అట్లైనఁ గాని తుకారాంబయాత్మకు శాంతిలేదు. అట్లైనచో మన మనుభవింపవలసిన పాపఫలము త్వరలో తీరిపోగలదు. ఇఁక నీవిషయము దాచరాదు."

"అయినచో నట్లే ప్రభువులకు నివేదింతును. కాని ప్రస్తుతము నన్నేమిచేయమందురు? మనశ్శాంతి కలుగు టెట్లు?"

"దేవతారాధనముకంటె చేయదగినదిలేదు. సెలవు."

"నమస్కారము"

రాజగురుపులు బయలుదేరినారు. ఇంతవఱకును గడ చిన రేయి జరిగిన వృత్తాంతమే వారిని బాధించుచున్నది. దానికిఁ దోడైనది మహారాణివలన వినిన విలాసినీ వృత్తాంతము! తుకారాంబ యొనర్చిన యపచారమునకు ఫల మామె కుమారై చేతిలో ననుభవింపవలసి వచ్చినది. విధివిధానము!

సాయంకాలమైనది. మహారాణిని పాపభీతి బాధించుచు నేయున్నది. పాపోపశమనార్థ మామె రామస్వామి యాలయ మున కేఁగి పూజలొనర్ప నిశ్చయించుకొనినది. చెలికత్తెలు

పూజోపకరణములు సమకూర్చి పళ్లెరముల నింపినారు. రాణి సఖులతో గూడ హజారరామస్వామి యాలయమునకుఁ బయలుదేరినది.

ఆయాలయము శ్రీకృష్ణరాయసార్వభౌములు ప్రత్యేకముగ రాణివాసస్త్రీలకొఱకు నిర్మింపఁజేసిరి. రామచంద్రస్వామి రాణివాసమున కిలవేల్పు. తన రాణులకిష్టదైవమైన రామచంద్రునియాలయ నిర్మాణమున సార్వభౌములు ప్రత్యేకశ్రద్ధ వహించిరి. ఎచ్చటెచ్చటి నుండియో యాయాలయ స్తంభముల కుపకరించు ఱాతిని తెప్పించినారు. దేశము నలుమూలలనుండియు శిల్పాచార్యులను రప్పించి నిర్మింపఁ జేసినారు. గుడిచుట్టును గోడపై శ్రీమద్రామాయణ చిత్రదృశ్య ప్రబంధనిర్మాణ మొనరింపఁజేసినారు.

మహారాణి చెలులతోఁగూడ రామస్వామిని దర్శించినది. పూజలొనర్చినది. స్వామీ ! నాపాప ముపశమించునట్లొనర్పుమని వేడినది. పుత్రహీననైన నాపై కరుణఁ జూపు మనినది. నా స్వామికిమనశ్శాంతిని కల్గింపుమని మ్రొక్కినది. సామ్రాజ్యమును కాపాడుమని ప్రార్థించినది, తన యకృత్యమును దలఁచి పశ్చాత్తాపమున విలపించినది. అర్చకుఁడు కర్పూరహారతి నిచ్చినాడు. ఆ కర్పూరపు కాంతిలో స్వామివారి ప్రసన్న గంభీరమైన మోము రాణి కభయమిచ్చినది. స్వామి ప్రసాదమును స్వీకరించినది. మఱల నిజభవనమునకు బయలుదేరినది.

•

౭

భువనవిజయసభామంటపము నేఁడు విశేషముగ నలంకరింపఁబడియున్నది. నేఁడే తిమ్మనకవికృత పారిజాతాపహరణ కావ్యకృతిస్వీకారమహోత్సవము! ఈనాటి సభయంతయు విశేషముగ కవి, పండితులతో నిండియున్నది. అయ్యది సరస్వతీవిలాసభూమి!

సార్వభౌములు సూర్యోదయాత్పూర్వమే మేల్కాంచి యెదుటనున్న నిలువుటద్దమునఁ దన ప్రతిబింబమును దర్శించి, పిమ్మట కపిలధేనువును, భద్రగజమును, పయఃపూర్ణకనకకుంభములను జూచి మజ్జన మాడి చలువలు ధరించిరి. ఆదిత్యహృదయస్తోత్రమును పఠించి, యిష్టదైవమగు శ్రీరామభద్రులను భక్తితోఁ దలఁచిరి. పిమ్మట లొల్లలక్ష్మీధరపండితు లేతెంచి రామాయణ, భాగవతములు పురాణముఁ జెప్ప కొంతతడ వాకర్ణించిరి. లక్ష్మీధరపండితునకు బ్రాహ్మణపూజ లొనర్చి చందనతాంబూలము లర్పించిరి.

కొలువునకుఁబోవు వేళ యైనది. ప్రభువు లలంకారమందిరమున కేఁగిరి. అచట అలంకరణచాతుర్యనిష్ణాతులు ప్రభువుకై ప్రతీక్షించుచుండిరి. వారికెదురుగ రాచనగరు బొక్కసమువారు సార్వభౌముల మణిమయభూషణముల బంగరుపళ్ళెరములఁ దాల్చి నిలువఁబడియుండిరి. సార్వభౌములు మందిరమున కేతెంచి యాసనముపైఁ గూర్చుండిరి. చంద్రముఖియొకర్తుక

నిలువుటద్దముఁగొని యెదుట నిలిచినది. మఱియొకస్త్రీ కేశములకు నూనె రాచినది. వేఱొకస్త్రీ దంతపుదువ్వెనతోఁ జిక్కు తీసినది. ఒక సుందరాంగి బొక్కసమువారిపళ్ళెరములందున్న రాజమకుటమును దీసి ప్రభువులశిరమున నలంకరించినది. సువ్వాణిముత్యముల కుచ్చు వెట్టినది. పచ్చలపతకమును, వజ్రంపు టుత్తరిగెను, మొఱపుకడియములను నలంకరించినది. చరణమున మూరురాయరగండపెండారముఁ దొడిగినది. సార్వభౌముల కొలువుశృంగారము పూర్తియైనది. సార్వభౌములు తమకై వేచియున్న భద్రగజాధిరాజముపై నధిరోహించి బయలు దేరిరి.

సభలో సమాగతసభ్యులెల్ల నుచితాసనము లలంకరించి యుండిరి. కవులకై ప్రత్యేకింపఁబడిన శ్రేణియం దగ్రభాగమున నాంధ్రకవితాపితామహులును, రాజాస్థానాంధ్రకవితా పరీక్షాధికారులును నైన అల్లసానిపెద్దనామాత్యు లాసీనులై యుండిరి. వారితరువాత నందితిమ్మన, ధూర్జటి మున్నగువా రాసీనులైయుండిరి. వారితోఁబాటు అష్టదిగ్గజములనిపించుకొనిన వారిలో కర్ణాటకభారతరచయితయైన తిమ్మణార్యుఁడు మున్నగాఁగల కవు లుండిరి. వారివెనుకభాగమున సంగీతవిద్వాంసులును, వ్యాకరణతర్కమీమాంసాదిశాస్త్ర పారంగతులును బారులుతీరి యుండిరి. కవులశ్రేణికెదురుగ మంత్రిసామంతదండనాథాదులును, నానాదేశాగతులైన రాయబారులును, సంప్రతి కరణములును నాసీనులైయుండిరి. సార్వభౌములసింహాసనమునకుఁ బ్రక్కనున్న బాలాసనములపై రాజబాంధవు లుపవేశించి

యుండిరి. అంతఃపురనారీజనమునకై రంగభూమిగూడ నేఁడు ప్రత్యేకింపఁబడినది. సింహాసనమునకుఁ బ్రక్కగ స్వర్ణమందిరమున సరస్వతీవిగ్రహ ముండెను. ఆ సరస్వతీమందిరము పై భాగమున శారదాధ్వజము చిఱుగాలి కల్లలాడుచుండెను. ఆ మందిరమునకుఁబైభాగమున నాస్థానకవితామర్యాదలు, నియమములు వ్రాయఁబడియుండెను.

సార్వభౌమాగమనసూచకముగ భేరీకాహళశంఖమృదంగాదుల ధ్వని చెలరేగెను వేత్రహస్తులు పైడిబెత్తములతో జనసమూహము నదలించుచుండ, హయారూఢులైనమన్నీలు మార్గము జూపుచుండ, భూసురులు వేదోక్తాశీస్సుల సేసలు వెట్టుచుండ, అంతఃపురకాంతాసమూహము మార్గమును పుష్పమయ మొనర్చుచుండ సార్వభౌము లేతెంచుచుండిరి.

వందిమాగధులు స్తోత్రములఁ బ్రారంభించిరి. భద్రగజము సభామంటపమువద్ద కేతెంచెను. సమీపముననున్న యువతులిరువురు కైదండయొసఁగ భద్రగజాధిరాజముపైనుండి సార్వభౌములు దిగిరి. వెంట రాజగురువు లుండిరి. సార్వభౌములు వేదిక నెక్కుటయేతడవుగ సభ్యులెల్లరు లేచి నిలువఁబడిరి. సార్వభౌము లాసీనులైనపిమ్మట, రాజబంధువులును, రాజగురువులును, ప్రధానామాత్యులును ఆపిమ్మట మంత్రిసామంతులును, అటుతరువాత కవిపండితమండలియు, సమాహూతపౌరజనమును యథాస్థానములఁ గూర్చుండిరి.

ప్రభువులు ప్రధానకార్యభరణుని ముఖమున కార్యక్రమమును సభ కెఱింగించినారు. కార్యభరణుఁడు కృతిస్వీకారము నకు సార్వభౌములయంగీకారమును సభకు వినిపించినాఁడు.

నందితిమ్మన లేచి ముందునకు వచ్చి సార్వభౌముల కును, రాజగురువులకును, ప్రధానామాత్యులకును, విద్వన్మండలికిని నమస్కరించినాఁడు. పట్టువస్త్రమునఁ జుట్టియుంచిన కావ్యగ్రంథమును విప్పినాఁడు. నారదాగమనమును, పారిజాత ప్రభావప్రశంసను, కృష్ణపరమాత్మ యా దేవతాసుమమును రుక్మిణికొసంగబోవుసమయమున నాతని మానసికస్థితిని, సుమమును రుక్మిణికొసంగుటయు, కలహభోజనుని కలహబీజ ముద్బద్ధమగుటయు, దాసీముఖమున సత్యభామ యీయుదంతమును వినుటయు, కోపగృహమున కేఁగుటయు మున్నగాగల ఘట్టములను చదివి వినిపించినాఁడు. తిమ్మనపలుకులే ముద్దులు మూటగట్టుచుండును. దానికిఁదోడైనది శ్రావ్యమైన కంఠము. శ్రోతలానందపరవశులైరి.

ఒకభాషావేత్త యనినాఁడు— "తిమ్మనార్యునిపలుకులు నవ్యశిరోషకోమలములు!"

వ్యాకరణవిద్వాంసు లనినారు— "భాష పాణినీయ వ్యాకరప్రామాణ్యము !"

రసజ్ఞు లనినారు— "కవితాధార మకరందరసాసార మధురము"

ఆలంకారికు లనినారు — "సకలజనమనోమోదసంధాయక సరసగుణాలంకారవిరాజితములు !"

కవు లనినారు —"పద్యములు సహృదయహృదయంగమ లలితభావ గాంభీర్యసుసుచిరంబులు ! అమృతంపుసోనలు ! తేనియతేటలు !"

శ్రోతలప్రశంసలు సాగుచునేయున్నవి. కృష్ణుఁడు సత్య ననునయించుఘట్టము వచ్చినది. తిమ్మన చదివినాఁడు—

ఉ॥ పాటలగంధి చిత్తమునఁబాటిలు కోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటుగామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతిమౌళిమణిపంక్తికివన్నియ వెట్ట నాజగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలిమ్రొక్కె,
ప్రమొక్కెనన్.

ఆంధ్రకవితాపితామహు డందుకొనినాఁడు— "ఆహా! సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపుఁడు ! - జగన్నాటకసూత్రధారి ! సత్యపాదములకు మ్రొక్కెనాఁడట ! అదియొక నాటకము ! ఆలీలామానుషవిగ్రహునిలీలలం దిది యొకలీల. తిమ్మనార్యా! బాగు ! ఎంతటియౌచితిని సాధించితివోయీ ! సత్యామానిని మానమును పరాకాష్ఠకుఁ గొనిపోతివి. భేష్ !"

రామభద్రకవి లేచినాఁడు— "కృష్ణపరమాత్మకీమ్రొక్కుటలో గౌరవహాని యేమున్నది ? గురుమానప్రకుపితయైన నాయిక ననుయించుటలో నిదియొక ప్రకారమని ఆలంకారికులే యంగీకరించినారుగదా ! దశరథుఁడు కౌసల్యకు మ్రొక్కె

నాఁడు. అధీరాప్రగల్భయగు నాయికను సృష్టించినాఁడు తిమ్మ కవీంద్రుఁడు. దుష్యంతుఁడు శకుంతలకు మ్రొక్కినాఁడు. ఆహా! ఏమి యానాయికలయదృష్టము! అట్టి ప్రణయైకజీవులైననాయికలను బొందిన వా రెంతటి యదృష్టవంతులు?"

సార్వభౌములహృదయమున నించుక సంచలనము ప్రారంభమైనది. ఇంతలో రాజగురువు లందుకొనినారు—"శ్రీకృష్ణపరమాత్మచరిత్ర నంత వేలనముగ సృష్టించుట బాగుండదు. అయ్యది గౌరవహాని!"

కవితాపితామహులు సమాధాన మిచ్చినారు— "కృష్ణుఁడు రసికావతంసుఁడు ప్రణయఘట్టము నాతనిచర్య యందలియౌచితి రసికజనానుభవైకవేద్యము. కవికులగురువు కాళిదాసే దుష్యంతునిచే శకుంతలకు మ్రొక్కించినాఁడు."

లక్ష్మీధరపండితు లనినారు— "వాల్మీకిమహర్షియే శ్రీరామచంద్రులకుజనకులైన దశరథునిచేఁ గైకకు మ్రొక్కించినారు. ఇం దౌచితీభంగము లేదు."

సార్వభౌములు తీర్మానించినారు— "ఔచితి కిందు భంగములేదు. కావ్యమందలి శ్రీకృష్ణుఁడు పరమాత్మకాఁడు, ప్రియుఁడు. అందుచే నియ్యది సమ్మతమైనదే!"

రాజగురువులు మాటాడలేదు. తిమ్మనయుత్సాహము ద్విగుణమైనది. ముందునకు సాగినాఁడు. మ్రొక్కినన్ ... ...

"జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై తన
ర్చ్చలతాంతాయుధుకన్నతండ్రిశిర మచ్చో్చ
వామపాదంబునన్
దొలఁగం(ద్రోచె లతాంగి, యట్లయగు, నాథుల్ నేరము
ల్సేయ పే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే?"

కవితాపితామహుఁ డనినాఁడు— "అవునుమతి! సామాన్యమైన మానసమా? ఈ యేకాంతప్రణయవ్యాపారము బాగున్నది! ఎంతచక్కని యర్థాంతరన్యాసమును వాడితివోయీ! ఎంతచక్కఁగఁ దొలఁగఁ ద్రోయించితివి? ఈముద్దుపలుకులు నీకే చెల్లినవి."

భట్టుమూర్తి యందుకొనినాఁడు— "ఆప్రణయకోపమే యట్టిది! ఒడలు తెలియునా? ఉచితానుచిత వివేక ముండునా? ఆ సత్యదే యదృష్టము! ఆ మహామానిని ననునయించినకృష్ణునిదే యదృష్టము! ఆ సౌందర్యరసాధిదేవతచరణకమలద్వయ మా సురపూజాభాజనమైనశిరమున కలంకారములే యైనవి."

రాజగురువులు మాటాడలేదు. ఆయనమనసు బాగుండలేదు. సార్వభౌములహృదయమున కలవరము బయలుదేరినది. 'చిన్నాదేవికోపమునకును, సత్యాదేవికోపమునకును భేదమేమి? ఏమియు లేదు. ఆ మహామహుఁడు సహర్షముగ సహించినాఁడు. నేను కోపగించితిని. నాకేల కోపముకలిగినది? కృష్ణున

కేల కోపము కలుగలేదు ? అతఁడు ప్రణయతత్త్వము నెఱింగిన మహానీయుఁడు, అవును ! ప్రణయకోపావిష్టులకు, మాత్సర్య గ్రస్తుల కుచితానుచిత వివేక మూఁడునా ? మనమే సంయ మముఁ జూపవలె. చిన్నాదేవియొనర్చిన స్వల్పప్రమాదమున కింతటిశిక్ష విధించుటతగునా ? రసికతకియ్యది లక్షణ మగునా? కోపముప్రమాదహేతువు. ఆనాఁడు తుకారాంబపై కోపమింతకుఁ దెచ్చినది. నేఁడు మఱల చినరాణిని బాధించుచున్నాను.' సార్వభౌములహృదయము చినరాణియెడల నవ్యనవనీతకోమల మైనది.

తిమ్మనార్యుఁడు కావ్యపఠనముఁ బూర్తిచేసినాఁడు. ప్రభువులు వినలేదు. సభాసదులు సాధువాదములు సల్పిరి. సార్వభౌములు తిమ్మనార్యునియెడ ప్రసన్నులైనారు. కవీంద్రుఁడు కావ్యమును సార్వభౌముల కరకమలములం దుంచి నమస్కరిం చినాఁడు. సార్వభౌములు అమూల్యాభరణాంబరములను, కాశ్మీ రపుశాలువను,సుగంధద్రవ్యములను సతాంబూలముగ కవికిచ్చి సత్కరించిరి.

అనంతర మనూనాచారము ననుసరించి కవి, పండిత బ్రాహ్మణమండలిని సత్కరించిరి. సభ చాలింపఁబడినది. సార్వ భౌములు రాజపురోహితులు వెంటరాఁ బూజాగృహమున కేగినారు.

* * *

సాయంసమయము. విజయనగరవీధులన్నియు నుత్సాహో త్సాహసంభరితములైయుండెను. జనమునందొకవిధమైనఉల్లా

సము కానవచ్చుచుండెను. క్రొత్తక్రొత్త దుకాణములు పరిసర ప్రదేశములనుండి వచ్చినవి. బొమ్మలకొట్టులు, మిఠాయిదుకాణములు, పూలయంగడులు నివియవియననేల ? రంగులరాట ములవద్ద పిల్లలు గుంపులుగఁ జేరినారు పాటలు, వినోదవేష ములు నుత్సాహజనకముగ నుండెను.

నేటియుత్సాహమునకుఁ గారణ మున్నది. నట్టువ తిమ్మయ్యమేళము గంగావతరణయక్షగానము చేయును. నట్టువ తిమ్మయ్యమేళము యక్షగానమున విశేషఖ్యాతి నార్జించినది. ఆమేళ మెచట ప్రదర్శన మిచ్చినను పరిసరగ్రామములనుండి జనులు తండోపతండములుగ నేఁగుదురు. సార్వభౌము లామే ళమున కొక మాన్య మేర్పఱచినారు. ప్రతియుత్సవసమయము నందును, తాయికొండనాటకమో, గంగావతరణమో, సుగ్రీవ విజయమో, హనుమత్సందేశమో వారు ప్రదర్శించుచుందురు. తిమ్మయ్య సూత్రధారుఁడు. ఆతనికుమార్తె నాగియు, పెండ్యాల బుచ్చిగాడును ప్రసిద్ధనటకులు. నాగి యానాటియువకుల మన్ననలందిన అభినేత్రి. బుచ్చిగాఁడు మంచినటకుఁడు. జనులు శ్రేణులుగట్టి వివిధాలంకరణాలంకృతులై బయలుదేరుచుండిరి.

ప్రాకారగోపురములపై మణిదీపములు వెలిగినవి. వీథు లన్నియు మణిదీపకాంతులచేఁ బట్టపగలుగ నుండెను. పురమున నున్న గృహములన్నియు దీపకాంతులచే నొప్పారుచుండెను. ఒక విశాల సమప్రదేశమున వేదికయొం డమర్పఁబడియుండెను. ఆవేదికపై రంగభూమిని పట్టువస్త్రములచే నిర్మించిరి. యవని కపై శ్రీకృష్ణభగవానుఁడు కాళీయ మర్దన మొనరించు దృశ్య

మున్నది, మణిదీపములముం దాదృశ్యము కనులపండువుగ నుండెను.

రంగభూమి కెదురుగ నశేష జనసముదాయ మెంత దూరముండెనో కనులకుఁ గాన్పించుటలేదు. సప్రవతితిమ్మయ్య తాళముల గొనినాఁడు. పసుపుపచ్చని పట్టుదోవతిఁ గట్టి, బంగరు జలతారుపూలుగల గులాబిరంగు కూర్పాసముఁ దొడిగి నల్లని శిరోవేష్టముఁ జుట్టి వెనుకనున్న జరీయంచులు బుజముమీఁదుగ ముందునకు జారవిడిచినాడు. వేరొండు తెల్లని వలిపెమును నడుమునకు బిగించినాఁడు. తిమ్మయ్య సూత్రధారుఁడు. తాళముచేఁబూని ఆలాపనముఁ బ్రారంభించినాఁడు. ప్రక్కనున్న మార్దంగికుఁడు మద్దెలను సరిచేసినాడు. తిమ్మయ్య ఆలాపనము, బూర్తిగావించి కథ నుపక్రమించినాఁడు. అ య్యక్షగానకర్త కులశీలగుణాదుల నభివర్ణించినాడు. కథ సాగినది.

ముందున్న యవనిక తొలిగినది. రంగమున భగీరథుఁడు సాక్షాత్కరించినాడు. కాషాయవస్త్రములు దాల్చియున్నాడు. గడ్డము పెఱిగి యున్నది. జడలు విరియబడి యున్నవి. పద్మాసనమున ధ్యానమగ్నుఁడైయున్నాడు. రాజవేషము లేదు. గంగానయార్థము తపస్వియైనాఁడు. తెరపై హిమగిరి ధవళశిఖరములు, అందుండి క్రిందకు ప్రవహించు సెలయేళ్ళు! భగీరథుఁ డాహిమాలయమున నున్నట్లు కన్పించుచున్నాఁడు.

సూత్రధారుఁడు గాన మొనర్చుచున్నాఁడు. ఆతఁడు పాడుచున్న కీర్తనయందలి భావము ననుసరించి భగీరథవేషధారి

యభినయము సల్పుచున్నాఁడు. ప్రేక్షకులు తన్మయులై తత్ప్రదర్శనిమగ్ను లగుచున్నారు. గంగాభవాని ప్రత్యక్షమగుట, భగీరథుఁడామెను భూలోకమునకు రమ్మని ప్రార్థించుట, ఆమె తన వేగాతిశయమును భరించుటకు శివుని ప్రార్థింపుమనుట, భగీరథుఁడు శివుని కొఱకై తప మొనరించుట, శివుఁడు ప్రత్యక్షమై భగీరథుని కోరికను మన్నించుట, భగీరథుఁడు మఱల గంగాదేవిని ప్రార్థించుట, గంగాభవాని శివజటాజూటమున నవతరించుట మున్నుగాఁగల కథయంతయు చక్కఁగరక్తి కట్టినది. తిమ్మయ్యకొమార్తె గంగాభవానివేషముఁ ధరించి యభినయించినది. బుచ్చిగాఁడు భగీరథునివేషము వేసినాఁడు. కంపన్న శివునిపాత్ర నభినయించినాఁడు. ప్రేక్షకులు నటుల యభినయమును ప్రశంసించినారు. కథ నంతను నడిపిన సూత్రధారుఁడు విశేషప్రశంసలకుఁ బాత్రుఁడైనాఁడు.

యక్షగాన ప్రదర్శనము పరిసమాప్త మగునప్పటికి తూరుపురేకలు తోఁచెను. మంగళము పాడినారు. ప్రేక్షకు లిండ్లకు బయలుదేరిరి.

— • • • —

౮

చిన్నాదేవికి నిముస మొక యుగమువలె గడచుచున్నది. సార్వభౌముల సంపూర్ణానురాగమునకు బదునెనిమిది వత్సరములనుండి పాత్రమై తన యిచ్ఛమెయి సార్వభౌములను ద్రిప్పుకొనిన యామె కిది యోగ మసహ్యముగనుండెను. ఇంతకుఁ బూర్వమును నప్పుడప్పుడు సార్వభౌములు తన యంతఃపురమునకు నెలలకొలఁది రాని దినము లున్నవి. కాని యానాఁడు తా నింత బాధపడలేదు. ఆనాఁడు భర్తృదర్శనము కాలేదని యే విచారము. నేఁ డావిచారమునకు దోడైనది భర్త తనయెడ నసంతుష్టుఁడైనాఁడనను విచారము, ఆమెకు భోజనము రుచించుట లేదు. నిదురపట్టుట లేదు. ఆభరణములఁ దాల్పదు. శరీర పోషణముపై నామెకు శ్రద్ధయే లేదు. ఎల్లప్పుడు మనసులో నేదియో దిగులు.

సార్వభౌములపూర్వప్రణయమును స్మరించుకొనును. దుఃఖోద్వేగమున నవిరళముగ నశ్రువులు ప్రవహించును. ప్రపంచమంతయు శూన్యముగఁ దోచును. తనతండ్రియింటి వద్దనున్నప్పుడే సుఖముగ నున్నది. చీకు చింతలు లేవు. ఆటల పాటలలోఁ గాలముఁగడిచినది. సార్వభౌములకు రాణియై తాన బాముకొనిన దేమున్నది? తుకాంబతోఁ గలిసి చిన్నతనమునఁ దాను గడపిన జీవిత మామెస్మృతిపథమునఁ గోచరించినది. తానును దుకాంబయు సమానవయస్కులు, తాను పట్టపు

రాణికూతురు. తుక్కాంబ మఱియొక రాణికొమార్తె. తన తండ్రి తమయిరువురను సమానముగ ప్రేమించినాఁడు. ఇరువురును సమానవయస్కలు. చదువుసంధ్యలు, ఆటపాటలు నొక్కటిగ జరిగినవి. అంతేకాదు, ఈయంతఃపురమున కేతెంచుటగూడ నొకేపర్యాయము జరిగినది. ఇరువురుకొమార్తెలు నొకచో నుందురని తండ్రి యూహించినాఁడు.

ఈయంతఃపురమున కేతెంచినపిమ్మట తుక్కాంబమాటయే సార్వభౌములవద్ద నెక్కువగ చలామణియైనది. అప్పుడు తుక్కాంబపై నీసు జనించినది. బాల్యముననున్న స్నేహభావము నశించినది. మాత్సర్య మావేశించినది. తనసుఖమునకుఁ దుక్కాంబ యడ్డమైనట్లు భావించినది. తుక్కాంబను తనమార్గమునుండి తప్పించుటయెట్లా యని తలపోసినది. సోదరీప్రేమ కీయంతఃపురమున స్వస్తిచెప్పవలసివచ్చినది. తనసోదరియైన తుక్కాంబ, తన చెలిమికత్తెయైన తుక్కాంబ శత్రువైనది. అయ్యది యౌవనమున మానవు నాశ్రయించు కామక్రోధాది యరిషడ్వర్గప్రభావము.

కాలము తుక్కాంబను కడుపునఁ బెట్టుకొనినది. తన యదృష్టము పూఁచి ఫలించినది. సార్వభౌముల యభిమానము నకుఁ బాత్రురాలైనది. ఇన్నిదినములనుండి తుక్కాంబ స్మృతియే లేదు. నేఁడు తాను తుక్కాంబస్థితికి వచ్చినప్పుడామెయెడల మఱల సానుభూతి జనించినది. కాని ప్రయోజ

నము? తుకాంబకుఁ దా నశుశ్రూషణ మొనరించుటకంటె నేఁడు చేయఁదగిన దేమున్నది?

రోజురోజునకును చినరాణి దుఃఖ మినుమడించు చున్నది. దుఃఖోద్వేగమును దనకుఁదానే యుపశమింపఁ జేసికొనును. మధ్యమధ్య తిమ్మకవీంద్రుఁ డనినమాటలు జ్ఞప్తికి వచ్చును. ఆనిరాశానిస్పృహాలం దొక యాశారేఖ పొడసూపును మరుక్షణముననే పూర్వాధికమైన నిరాశ— దుఃఖము! ఆమెకుఁ దనబ్రతుకే యసహ్యముగ దోచుచున్నది.

దాసివచ్చినది. చినరాణిముఖమున దైన్యము గోచరించుచున్నది. కన్నీటిచారికలు కన్పించుచున్నవి. 'అమ్మా!' యని దాసి పిలచినది.

చినరాణికంఠము వణకిపోవుచున్నది. ఆమె కను లెఱ్ఱబారియున్నవి. నోట మాట పెగలివచ్చుట లేదు, అర్థహీనమైన దృక్కులతో దాసివైపుఁ జూచినది.

దాసి చినరాణిచెంత కేతెంచి యోదార్చినది. "అమ్మా! దినములన్నియు నొకేవిధముగ నుండవు. కష్టసుఖములు కావడికుండలు. కష్టములపిమ్మట సుఖములు, సుఖముల పిమ్మట కష్టములు, బర్యాయమున వచ్చును. మంచిరోజులు త్వరలోనే రాగలవు."

రాణి:- ఏమో! నాకట్టి యదృష్టమున్నట్లు తోచుట లేదు. మా తుకాంబవలె నాజన్మ మిట్లంతము కావలసినదే!

దాసి:— అమ్మా! అట్లనరాదు. ఎవరియదృష్టము వారిది.

రాణి యించుకసేపాగినది. దాసి మఱల— 'అమ్మా! లెండు! భోజనముమాని శరీరమును శుష్కింపఁజేసుకొనరాదు.'

రాణికి భోజనమువిషయమైన ధ్యాస లేదు— "ఓసే! తిమ్మనార్యులు మఱల నెన్నఁడైన కనుపించిరా?"

"కనుపింపలేదు. వారును ప్రయత్నమొనరించుచునే యుండియుందురు."

"ఏమిప్రయత్నమో! నాజీవము లుండఁగ నాప్రయత్నములు పూర్తియగునట్లు లేవు. వారుమాత్ర మేమిచేయుదురు? నాకర్మ మిట్లున్నది! తీయనిమాటలు చెప్పి వెడలినాఁడు. మఱల ముఖముఁ జూడలేదు."

"అమ్మా! కవీంద్రులను పిలిచికొనిరానా?"

"పోయిరమ్ము!"

దాసి వచ్చునప్పటికి తిమ్మకవీంద్రుఁడు చినరాణి యంతఃపురమున కేఁగు ప్రయత్నమున నున్నాఁడు. దాసి చిన్నాదేవిస్థితి నెఱింగించినది. తిమ్మనకాశ్చర్యము కలిగినది. దాసిని పంపివేసినాఁడు. తాను శాలువ బుజమున వేసికొని బయలుదేరినాఁడు. అతనిమనసు సంతోషముగనున్నది. నిన్నటిదినమున సార్వభౌములమోమునఁ బశ్చాత్తాపచిహ్నములు గోచరించినవి. వారిహృదయము చినరాణియెడలఁ బ్రసన్న

మైనటుల వారివేూము భాసించినది. కవీంద్రున కదియొక సంతోషకారణము. పండితపరిషత్సమక్షమునఁ దనకావ్యము సార్వభౌముల ప్రశంసలనందుట మరియొక సంతోషకారణము. అతఁ డుత్సాహమున చినరాణిభవనమునుచేరినాఁడు. ఆతనికై ప్రతీక్షించుచుండినదాసి కవీంద్రునియాగమనవృత్తాంతము రాణి కెఱింగించినది.

రాణికిప్రాణములు లేచివచ్చినవి. తెరమాటున కేఁగినది. తిమ్మకవీంద్రుఁడు గదిలోని కేతెంచినంతనే రాణి 'కవీంద్రులకు నమస్కారము' అనినది.

'రాణుల కాశీస్సులు' అని తిమ్మన సమీపమున తనకై యుంచిన ఆసనముపై నాసీనుఁ డైనాఁడు.

"ఏమైనది ? మాకేమైన మంచిరోజు లున్నవా ? లేక మాజీవిత మింతియేనా ?"

"అమ్మా ! అధైర్యపడవలదు. రాణులకు సర్వము శుభమగును."

"ఏమగునో యేమో ! ఇంతకును మీప్రయత్నము లేమైనవి ? అసలు ప్రయత్నించినారా ? లేదా ?" రాణియుద్విగ్నత హెచ్చెను.

'అమ్మా ! మాచేతనైనదంతయుఁ జేసితిమి. పరిస్థితు లనుకూలముగనే యున్నట్లున్నవి.'

"ఇంకేమిపరిస్థితులు ? ఎన్నాళ్ళపరిస్థితులు ?

రాణియుద్వేగము తిమ్మరుసు మంత్రునకు వింతగనుండెను. 'ఆహా! వియోగప్రభావ మెంతబలీయమైనది'? అనుకొని— "అమ్మా! సేవను చేయవలసినదంతయుఁ జేసితిమి. ఇఁక మిగిలినదంతయు మీచేతిలో నున్నది."

"ఇఁక మీరొసర్చిన దేమి?"

"ప్రభువులహృదయము మాఱినది. సార్వభౌములు మీయెడ ప్రసన్నులైనారు. కాని తమంతటతాము వచ్చుట కించుక సంకోచ ముండవచ్చును."

"నేను సార్వభౌముల నాహ్వానింపవచ్చునా?"

"కాదు. తామే సార్వభౌములదర్శనమునకు వత్తుమని కబురుపంపుఁడు. వారు వచ్చుటయో లేక మీరేఁగి దర్శించుటయో జరుగును."

"సరే! నమస్కారము."

"సెలవు."

చినరాణి దాసిచే కవికిఁ దాంబూల మిప్పించి పంపివేసినది. ఆలోచనలు బయలుదేరినవి. ప్రభువులకుఁ గబురు పంపుటెట్లు? ఏమని కబురు పంపవలెను? ప్రభువులదర్శనమునకుఁ దాను వచ్చుచున్నాననియా? రాణికిఁ గొంచె మభిమానముఁ దోచినది. కాని, మఱల కార్యసాధన కిక తప్పదని నిశ్చయించుకొనినది.

పండ్రెండుగంటలు దాటినది. పూజావిధులు నిర్వర్తించుకొని సార్వభౌములు నిజసదనమునకు విచ్చేసినారు. గడచిన రాత్రియంతయు వారిమనసు చిన్నాదేవిపైపున కాకర్షింపఁబడుచునేయుండెను. ఒకటిరెండుపర్యాయములు లేచినారు— బయలుదేరుటకు. కాని మఱల అభిమానము పొడసూపినది. ఆగినారు. మఱల నీవిశ్రాంతిసమయమునఁ జిన్నాదేవి జ్ఞప్తికి వచ్చినది. చిన్నాదేవివద్దకేఁగుటయెట్లు? నాకై నే నేఁగుట గౌరవహాని. ఆమె యేలకబురు పంపరాదు? సార్వభౌము లిట్లాలోచించుచుండగనే పరిచారికయొకర్తుక వచ్చి— "ప్రభూ! చినరాణిగారియంతఃపురమునుండి దాసి వచ్చినది." అని విన్నవించినది.

ప్రభువుల కాశ్చర్యముకలిగెను— "చినరాణిగారి యంతఃపురమునుండియా? లోనికిఁ బ్రవేశపెట్టుము."

దాసివచ్చి సార్వభౌములకు నమస్కరించినది- "ప్రభూ! చిన్నాదేవిగారు పంపినారు."

"చినరాణులకు క్షేమమా?"

"ప్రభూ! ఏమనిచెప్పుదును? దేవరవారు వెడలిపోయినది మొదలు నిద్రాహారములు లేవు."

ప్రభువుహృదయము ద్రవించెను. పాపము! తనకై యెంతపరితపించుచున్నదో! మఱల దాసిని ప్రశ్నించినారు— "చిన్నాదేవిగా రేమనినారు?"

ప్రభుదర్శనమున కనుజ్ఞ వేడినారు.

సార్వభౌములహృదయము సగద్గద మయ్యెను. చిన్నా దేవిపైఁ గల యనురాగము పెల్లుబికెను. పాపము! ఎంత తపించినదో! ఎంతగ పశ్చాత్తాప పడినదో! పాపము! తనయభిమానమును దిగమ్రింగికొని కబురుపంపినది. ప్రభువులకామెపైఁ గరుణకలిగినది. ఆమె నంతవేధించినందులకుఁ జింతించినారు—"ఓసీ! చిన్నాదేవిగారితోఁ జెప్పుము! మేమే యీరాత్రి కామెరాణివాసమునకు వత్తుము."

దాసి ప్రభుపాదములకు మ్రొక్కి వెడలిపోయినది.

సార్వభౌములు సాయంసభాసమావేశమునకుఁ బోవు వేళయైనది.

ప్రభువు లీవేళ చాలఉత్సాహముగనున్నారు. సైనిక విన్యాసమునఁ బ్రత్యేకశ్రద్ధ చూపినారు. సేననంతయు శ్రద్ధగఁ బరిశీలించినారు. సైనికవందనమును స్వీకరించి రాచనగరునకు బయలుదేరినారు.

చంద్రోదయము కావచ్చినది. ఉదయోన్ముఖుఁడైన రోహిణీప్రియుఁడు ప్రభువులకుఁ బ్రియామార్గగామిత్వము నుద్బోధించుచున్నాఁడు. కువలయము రాజసందర్శనకుతూహలమును వ్యక్తమొనరించుచున్నది. దూరాకాశమున మబ్బులచాటునుండి చందురుఁ డేతెంచుచున్నాఁడు. సార్వభౌములు నిజసౌధోపరిభాగమునుండి వీక్షించినారు. చిన్నాదేవి సౌధోపరిభాగముననున్న కనకకలశము కానుపించినది. మనసు ప్రియాసంయోగమునకుఁ దొందరవెట్టుచున్నది. సార్వ

భౌములు సౌధాగ్రభాగమునుండి దిగినారు. స్నానపుగదికిఁ బోయి యచటనున్న గద్దెపై నాసీనులైనారు. పరిచారికలు సుగంధపూర్ణమైన పన్నీటికొప్పెరలు ప్రభువునకు సమీపమున నుంచిరి. అవ్వానికి సమీపముననే కడాని తంబుగల నుంచిరి. ప్రభువులను జలకమునకు హెచ్చరించి బయటకేఁగిరి. ప్రభువులు జలక మాడినారు. ముదితలు తడియొత్తిరి. ఒక సుదతీమణి సార్వభౌములకు రత్నపాదుకలఁ దొడిగినది. వేఱొకచంద్రవదన పట్టుపుట్టము లందిచ్చినది. మఱియొకపూఁబోఁడి చెంగావి జరీ రంగుగల యుత్తరీయమును భుజమున సవరించినది. ప్రభువచటినుండి భోజనశాల కేతెంచిరి.

పూఁబోణులు కొందఱు భోజనభాండములఁ దెచ్చి తెర చాటున నుంచిరి. ఒకతె ప్రభువునకుఁ గుందనపు పీఠమునైచి బంగరుపురతకాల్పరుపు ఘటించెను. బంగరుసింగపుకోళ్ళుగల యడ్డిగపైఁ బళ్ళెర మునిచిరి. అద్దానికి చుట్టును బటువులు చౌకములుగనుండిన గిన్నియ లమర్చిరి గిలుకుమట్టియలమంజుల ధ్వనులతో లతాంగులు వడ్డనలు ప్రారంభించిరి. ప్రభువులు నేఁడు తృప్తిగ భుజించినారు. సీతాంశువదనయొకర్తుక చేగిండ్లు వంప మఱియొకతె ప్రభువులచేతులు గడిగినది. ప్రభువు శుద్ధాచమన మొనర్చి, తులసీదళభక్షణ మొనర్చి, యటునిటు పచారు లొనర్చెను. అచటినుండి సుదతీమణులు కొందరు వెంటరా నలంకారభవనమునకు విచ్చేసిరి.

ప్రభువులు మగరాలనిగరాలజిగిదేఱు కనకపీఠిపై నుపవేశించిరి. అలంకారనిష్ణాతలు ప్రభువు నలంకరించిరి. గోవ

జవ్వాది కుంకుమ కస్తూరములు కలిపిన లేపము లలందిరి. పూఁబోఁడియొకర్తుక చకచకనిపూబంతి చేతికందిచ్చెను. ప్రభువు యవనాశ్వముపైనెక్కి చిన్నాదేవిభవనమునకు బయలుదేరెను.

చిన్నాదేవియు సమస్తాభరణభూషితయై రూపజితరతీదేవివోలె నుండెను. చెలులామెను సర్వాంగసుందరముగ నలంకరించిరి. గులాబిరంగుచీర కుచ్చెలువోసి వెనుకకు విఱిచి గోచిపోసికట్టిరి. ఆ చీరజరీయంచు పాదములనుండి యూరుభాగమువఱకు నర్ధచంద్రాకృతిగ నుండెను. వక్షోభాగమున బంగరుజరీపువ్వులుగల నల్లనికంచుకముఁ దొడిగిరి. కేశములల్లి చొళ్ళెముపెట్టి పూదండలుంచిరి. ముంగామురము, రత్న కంకణములు, అంగుళీయకములు, చిఱుగంటల మొలనూలు, ఒడ్డాణము, అందియలు, పచ్చలు పొదిగినపాపటకట్లు, వజ్రాల సరుల నలంకరించిరి.

ప్రభువులు సౌధమువద్ద దిగినారు. పరిచారికలు ప్రభువును సౌధోపరిభాగమునకుఁ గొనివచ్చి వెనుకకుఁ దగ్గిరి. చిన్నాదేవి తనయాంతరంగికసఖులతోఁగూడ ప్రభువుల కెదురేఁగి స్వాగత మిచ్చినది.

చిన్నాదేవి యానందమున కవధి లేదు. కాని యాయానందమున నేఁ డొకవిధమైన సంభ్రమమును నుండెను. ప్రభువులు తనభవనమున కేతెంచుట క్రొత్తకాదు. వారికి స్వాగత మిచ్చి సంతుష్టుల నొనరించుటయుఁ గ్రొత్తకాదు. కాని నేఁ డంతయుఁ గ్రొత్తగనే యుండెను.

చిన్నాదేవి ప్రభువులను తల్పమునఁ గూర్చుండఁబెట్టినది. కర్పూరనీరాజన మిచ్చినది. దాసి చుట్టియుంచిన తమలపాకుల చిలుకలు పళ్ళెరమున నున్నవి. ప్రభువునకు విడియమిచ్చినది. చెలికత్తె ప్రక్క కేఁగినది. చిన్నాదేవి ప్రభుపాదపద్మములను కనుల కద్దుకొనినది ప్రభువామెను లేవనెత్తి గ్రుచ్చినాఁడు. ప్రక్కనఁ గూర్చుండఁబెట్టుకొనినాడు. "చిన్నా! నే మిచటికి వచ్చి చాలదినములైనట్లుది!" అసినాడు.

చిన్నాదేవిహృదయము పొంగివచ్చినది. నోటమాట రాలేదు. కన్నులనుండి రెండు వేఁడికన్నీటిచుక్కలు జాలువారి ప్రభువులచేతిపైఁ బడినవి. ఆమె యనుభవించిన విరహతాప మంతయు నాకన్నీటిచుక్కలలో వ్యక్తమైనది — ప్రభువునకు! ఆమె ననునయించినాఁడు—"చిన్నా! ని న్నెంత హింసించితిని!" ప్రభువు కంఠము సగద్గద మయ్యెను.

ప్రభూ! మీవలన దోసము లేదు! ఈ నాటికైనను ప్రభుపాద దర్శనభాగ్యము లభించినది. నా కదియే పదివేలు!"

ప్రభువు చిన్నాదేవిని సమీపమునకుఁ లాగికొనినాడు. ఆమెచిబుకమును స్పృశించి ముద్దిడుకొనినాఁడు.

ఆకసము నిర్మేఘమైనది. సుధాకరుఁడు చిరునవ్వులఁ జిందించు చున్నాఁడు.

ఆరాత్రియంతయు వారు గడచిన యనుభవములను త్రవ్విపోసికొనినారు. మహారాజు నేఁడు నిజముగసుఖించినాఁడు.

——•••——

౭

సార్వభౌము లుషఃకాలమునకుఁ బూర్వమే మేల్కాంచి చిన్నాదేవిసౌధమునుండి బయలుదేరిరి. వారు నిజసదనమునకుఁ జేరునప్పటికే మల్లవిద్యాప్రవీణులు ప్రభువులకై ప్రతీక్షించుచుండిరి. ప్రభువులు లోనికేఁగిరి. పరిచారికలు ఆభరణములఁ దొలగించిరి వ్యాయామ సమయమునఁ బ్రభువులుధరించు వస్త్రములు గొనిరాఁబడినవి. సార్వభౌములు బయలుదేరినారు. మల్లవిద్యాప్రవీణులు వారి ననుసరించిరి.

సార్వభౌములు జాత్యశ్వముపైనెక్కి సాముగరిడీలశాలకేఁగిరి. అయ్యది యొక పెద్దశాల. అద్దానిని స్తంభములపై నిర్మింపఁజేసిరి. అనేకవిధములైన గరిడీపరికరములు నాయుధములు గోడలకు వ్రేలాడుచుండెను. మల్లులు మల్లలు చఱచికొనుచుండిరి.

ఆశాలయందొక యున్నతాసన మున్నది. సార్వభౌము లశ్వమునుండి దిగి శాలలోని కేఁగి యాసనముపైఁ గూర్చుండిరి. ఆంతరంగికసేవకుఁడైన కాళుఁడు ప్రభువులకు స్వర్ణపాత్రతో నువ్వులనూనెఁ గొనివచ్చి యిచ్చినాఁడు. ప్రభువు లాపాత్రి యందున్న నూనెను గుటగుట త్రాగివైచిరి.

ఇరువురు కండలుతేలిన బలిష్ఠులేతెంచి ప్రభువునకు శరీరమర్దన మొనరించిరి. శాస్త్రీయముగ నవయువములను

మర్దించి వాటిశైథిల్యమును బోగొట్టిరి. ప్రభువులులేచి దండె
ములు ప్రారంభించిరి.

అపిమ్మట గోడపైవ్రేలాడు ఖడ్గము నొకవీరుఁ డందిచ్చి
నాఁడు. తా నొక ఖడ్గమునుఁ గొనినాఁడు. ఇరువురునుఁ గొంత
తడవు కత్తిసాము చేసిరి. ద్వంద్వయుద్ధ మొనర్చిరి. సార్వభౌ
ములే ఖడ్గచాలనమున నతిశయించిరి. కత్తిసాములు పూర్తి
యైనవి.

పిమ్మట మల్లయుద్ధము! ప్రభువులకు మల్లయుద్ధమనిన
వేడ్కవయిష్టము. శాలయందు మధ్యభాగమున మల్లయుద్ధ
మునకుఁ స్థలము ప్రత్యేకింపఁబడియుండెను. నాల్గుగజములు
చతురస్రముగ నొకగోతిని త్రవ్వి యద్దాని నిసుకతోఁ బూడ్చిరి.
దానిపై గడ్డిపరుపు నొకదానిని పఱచిరి. సార్వభౌముల
యాస్థానమున మల్లులు చాలమంది యుండిరి. వారందరును
వంతులప్రకారము దినమునకొకరు సార్వభౌములతో మల్ల
యుద్ధ మొనర్చుట నియమము.

మల్లుఁ డొకఁ డేతెంచినాఁడు. ప్రభువులు నిర్ణీతస్థాన
మున కేఁగిరి. ఇరువురును మల్ల చఱచిరి. చేతు లందించు
కొనిరి. పట్టు చిక్కించుకొనుటకై ప్రయత్నించిరి. మఱల వెనుక
కేఁగిరి. ముందునకు వచ్చి చేతులు కలిపిరి. మల్లుఁడు ప్రభు
వుల నెత్తి చేతులపై గిరగిర త్రిప్పి నేలపైఁ బడవేసెను. క్రింద
పడుటయే తడవుగ సార్వభౌములు లేచిరి. మల్లున కవకాశము
చిక్కలేదు. వాయువు క్రిందనుండి లేచుచు నాపర్వతాకారుని
భుజములతో నెత్తి పడవేసిరి.

ఈవిధమున నొకగంటసేపు మల్లయుద్ధము జరిగినది. ప్రభువు లలసిపోయినారు. వారు త్రాగిననూనె యంతయు చెమ్మటలరూపమున బయటకు వచ్చినది. ప్రభువు లాపాద మస్తకము తడిసియున్నారు.

ఇంతలో నశ్వశిక్షకు లొక జాత్యశ్వమును గొనివచ్చి సిద్ధముగ నుంచిరి. సార్వభౌము లాయశ్వము నెక్కి ప్రాకారము జుట్టును స్వారిచేసిరి. దైనికవ్యాయామము పూర్తియైనది. ఆయశ్వముపైననే భవనమున కేఁగినారు.

సూర్యోదయమైనది. బాలభానుకిరణప్రసారమున లోకము తెలివిగాంచినది. అంతవఱకు నావరించియున్న తిమిరములు పటాపంచలైనవి. ప్రభువులు స్నానవిధులను నిర్వర్తించుకొని చలువలు ధరించినారు. ఆదిత్యహృదయమును ముమ్మారుపఠించి, అష్టాక్షరీమంత్రమును జపించి లేచినారు. పూజాభవనమున కేఁగు వేళయైనది.

నేఁడు మహానవమి. ఏకారణముననైన మార్గమధ్యమందుండిపోయిన మండలేశ్వరులు నేటికైనను రాజధానినిఁ జేరవలెను. ఈనాఁడు పూజావిధులు శతగుణాధికములుగ జరుగును. అందుచే సామ్రాజ్యమునఁ బలుతావులనుండి బయలుదేరిన తైర్థికులు నేఁడు రాజధానికిఁ జేరుదురు. నగరమున జనసంఖ్య త్రిగుణమైనది.

సభాభవనప్రాంగణమంతయుఁ గిక్కిరిసియున్నది. సభయందు నేఁడొక యాసనమైనను రిక్తముగ లేదు. అందఱును

విచ్చేసిరి. నే(డుత్సవమంటపముచుట్టును సైనికులు పూర్వాధి కముగ నప్రమత్తులై కావలి గాయుచుండిరి.

వందిమాగధులకై వారములును, భేరీమృదంగకాహళాది వాద్యధ్వనులును చెలరేగినవి. సార్వభౌములు భద్రగజాధి రూఢులై యుత్సవమంటపమున కేతెంచిరి. రాజపురోహితులు సార్వభౌములను పూజాగృహములోనికిఁ గొంపోయిరి. ప్రభువు లిబ్బడియైనభక్తితో పూజ లొనర్చిరి. భేతాళునకు మ్రొక్కిరి. శ్రీదేవిప్రసాదమును స్వీకరించిరి. బ్రాహ్మణులవేదాశీస్సుల నంది వారిని సంభావించిరి. బలివిధులు పూర్తియైనవి. బలి పశువులసంఖ్య దినదినమును పెరుగును. నేఁడు రెండువందల యేబదిమహిషములును, నాల్గువేల గొఱ్ఱెలును బలి యొసంగఁ బడినవి.

ప్రతిసంవత్సరమును ప్రభువులు నవరాత్రోత్సవసమయ మున సామ్రాజ్యసైన్యమును సత్కరించు టాచారము. సేన లన్నియు వరుసగ బారులుతీఱియున్నవి. ముందుభాగమున సార్వభౌముల స్వీయదళములున్నవి. ఆవెనుక సామంతసైన్యము లున్నవి. ప్రతిదళమునకును ముందుభాగమున దళాధిపతి నిలువఁ బడియుండెను.

ఆసేనకుఁ బ్రాగ్భాగమున నొక యెత్తైనవేదిక నిర్మింపఁ బడినది. ఆవేదికపై సార్వభౌములకొక సుఖాసన మమర్పబడి యున్నది. సార్వభౌములకు శ్వేతచ్ఛత్రములు పట్టిరి. సార్వ భౌములకుఁబ్రక్కనే మహామాత్యులుండిరి. వేరొకప్రక్క

ప్రధానకోశాధికారియు బొక్కసమువారును నుండిరి. వేత్ర్వేసగ పళ్ళెరములందు వరహా లుండెను. వస్త్రము లుండెను.

ప్రధానామాత్యులకు బ్రక్కన ధన్నాయకుడు నిలువబడి దళనాయకులను పేరువరుసను బిలుచుచుండెను. కోశాధికారి పళ్ళె మొకదానిని ప్రభుసమక్షమునకు గొంపోయెను. ప్రభువు లాపళ్ళెరమును స్పృశించిరి. కోశాధికారి మఱల యథాస్థానమున నిలువబడెను. దళనాయకు లొక్కొక్కరే యేతెంచి ప్రభువులకు నమస్కరించి పళ్ళెరములు గొనుచు నాలుగడుగులు వెనుకకు నడచి తమతమస్థానముల కేగుచుండిరి. ప్రధానకరణికుడు లెక్కలు వ్రాయుచుండెను. స్వీయసేనాసత్కారమైనపిమ్మట అమరపట్టియనాయకుల సత్కారములైనవి. దళనాయకుడే తనదళములోనివారి కా ధనమును బంచిపెట్టును. ఆ మహాసైన్యమంతయు సార్వభౌముల కభివాదనము సల్పి కదలినది. జయజయనాదములతో నడచుచున్న యా మహావాహిని ఘూర్ణిల్లుచున్న మహోదధి ననుకరించెను. ఆ సైన్య మచటినుండి కదలి పురమున విన్యాసములొనర్చి స్వస్థానముఁ జేరును.

ఈకార్యకలాపములు ముగియునప్పటికి పండ్రెండు గంటలైనది. ప్రభువులు నిజసదనమున కేగి కార్యభారమునఁగలిగిన యలసటను బాపుకొన విశ్రమించినారు. ఇంతలోఁ బ్రతీహారి యొక్కడే తెంచి — "ప్రభూ! ఒక వృద్ధనారి యేతెంచినది. కంభమట! విరూపనాయకుల తల్లియట!"

ప్రభువులామెను లోని కనుమతించినారు. విరూప నాయకుఁడు రాయలవిశ్వాసపాత్రుడు. లేపాక్షి వీరభద్రస్వామి యాలయనిర్మాణభారమును రాయలవారతనిపైఁ బెట్టిరి. అతఁ డాబాధ్యతను చక్కగ నిర్వర్తించినాఁడు. తుక్కాంబ యతః పురమున కేతెంచుసరికి కంభమున జగన్నాథపాత్రుఁడు దుర్గాధిపతిగ నున్నాఁడు. అతఁడు సరిగ వ్యవహరింపకపోవుటచే ప్రభు వాతనిని దొలగించి విరూపన్న నాస్థానమున నియమించి నారు.

వృద్ధనారి యేతెంచి ప్రభువులకు నమస్కరించినది— “ప్రభూ! వృద్ధను. పుత్రహీనను! ఏలినవారు దయఁజూడవలె.”

“ఏమిజరిగినది?”

“ప్రభూ! జగన్నాథపాత్రుఁడు నాపుత్రునిఁ బొట్టఁ బెట్టుకొనినాఁడు. దిక్కులేకుండఁ జేసినాఁడు.”

“ఏమీ! విరూపన్ననా?”

“అవును ప్రభూ!”

“జగన్నాథపాత్రుఁడా?” రాయల కను లెఱ్ఱవారినవి. వృద్ధ నిలబడియున్నది. ప్రభు వామెను కూర్చుండ సంజ్ఞ చేసినారు. వృద్ధ క్రిందకూర్చుండి— “ప్రభూ! ఈవైర మీనాటిదికాదు. ఇరువది సంవత్సరములనుండి రగులుచునే యున్నది. నేటి కీవిధముగఁ బరిణమించినది. నాకుమారుఁడు సార్వభౌములవద్దకీ వివాదమును రానీయక యెట్లో యీ యిరువదిసంవత్సరములు గడపినాఁడు.”

"ఏమి జరిగినది? సైగకారణ మేమి?"

"తాము జగన్నాథపాత్రిసిఁ దొలగించి నాకుమారుని దుర్గరక్షకునిగ నియమించినారు. పాత్రిఁడు తుక్కాంబాదేవికి మేనయత్త కుమారుఁడట! ఈదుర్గము గజపతులు తుక్కాదేవి కరణముగ నొసంగియుండుటచే నీదుర్గముపై సార్వభౌముల కెట్టి స్వత్వమును లేదని వాదించినాఁడు. ప్రభువులసేవకుఁడాతని మాటలను లెక్కజేయక దుర్గమును స్వాధీన మొనర్చుకొనినాఁడు. అప్పటినుండియు పాత్రిడు దేవరవారి సేవకునిపైఁ బగపూనినాడు. ఆతనిని సమయింప నెన్నియో పన్నాగములు పన్నినాఁడు. కాని నాకుమారుఁడు మెలకువతో వ్యవహరించుచున్నాఁడు. ప్రభువులయాజ్ఞను పాలించుచునే యున్నాడు. ఇంతలో నకస్మాత్తుగ తుక్కాదేవిగారే యచటికేతెంచిరి. జగన్నాథపాత్రిఁ డామెద్వారమున దుర్గమునుసాధింప విశ్వప్రియత్న మొనరించినాఁడు. కాని యామహాతల్లి తమసేవకునే దుర్గాధిపతిగ నంగీకరించిరి. కాని దైవము ప్రతికూలుఁడైనాఁడు. ఆమహాసాధ్వి యెక్కువకాలము జీవింపలేదు. ఆమె దుర్గమునకు వచ్చినపిమ్మట నయిదారునెలల కొక కొమార్తె కలిగినదని కొంద అనినారు. కాని యా శిశువేమైనదో తెలియదు.

తుక్కాదేవి చనిపోయిననాటినుండియు పాత్రిఁడుమరలఁ దన యుద్యమమునుఁ బ్రారంభించినాఁడు. అనేకులను తనపక్షమునకుఁ ద్రిప్పయత్నించినాఁడు. తుక్కాదేవికొమార్తె తనవద్ద పెరుగుచున్నదనియు, నామెకు సంరక్షకుఁడు తా ననియు, ఆ దుర్గ మాంబాలికదనియుఁ బ్రచార మొనర్చెను. కాని విరూపన్న

యేమాత్రమును జంకలేదు. పాత్రిని లెక్కసేయలేదు. మొన్న శ్రావణమాసమున నొకరాత్రివేళ అకస్మాత్తుగ దుర్గముపైఁబడి విరూపన్నను బొట్టఁబెట్టుకొనినాఁడు. ప్రభువు లీ యనాధను కరుణింపవలెను.”

సార్వభౌముల కిదియంతయు నగమ్యాగోచరముగ నున్నది. ఏనాటిజగన్నాథపాత్రుఁడు? నేఁడు వీనికిఁ గాళ్ళు వచ్చినవా? వీఁడు తుకాంబకు మేనయత్త కొమరుఁడా? కోపోద్వేగమున సార్వభౌముల మోము మొఱ్ఱవారినది. ప్రతీహారిని బిలిచినారు. ‘ఈమెను మహారాణియంతఃపురమునకుఁ జేర్చవలసిన సదుపాయములు గావింపుఁడు.’ అని యాజ్ఞాపించినారు. వృద్ధ నమస్కరించి వెడలిపోయినది.

సార్వభౌము లుద్విగ్నులై యున్నారు. తుకాంబకుఁ గొమార్తె జనించినదా? ఈ భావము సార్వభౌముల కొక శూలమువలె నాటి హృదయమును కలఁచినది. ఆమె యిచటినుండి యేగునప్పటికి గర్భవతియా? ఎవరెఱుంగుదురు? తనకుఁ జెప్పినవా రెవరు? ఆకుమార్తె నిజముగ పాత్రినివద్దనున్నదా? మఱి యావృద్ధజనులు చెప్పికొనుటేగాని శిశు వేమైనదో తెలియ దనిన దేమి? శిశువు పుట్టినవెంటనే చనిపోయినదా? ప్రభువుల కింతలో విలాసిని స్మృతిపథమున మెఱసినది. ఆమెను జూచినప్పటినుండియుఁ దన కనుమానముగనే యున్నది. కాని, విలాసిని వేశ్యగదా! పాత్రిఁడు బాలిక తనవద్దనున్నదనుట నిజమా? లేక లోభముననా? అహో! ఎంతపనిజరిగినది! తుకాంబ

మరణము! విరూపన్న మరణించినాఁడు! బాలికవిషయ మజ్ఞేయము!

పవలంతయు సార్వభౌముల మనసు మనసులో లేదు. యోచనాతరంగము లుప్పతిల్లినవి. పెఱిగినవి, విఱిగినవి. ఆ తరంగముల కంతులేదు! కాని యాతరంగముల తాకిడికి సార్వభౌముల మస్తిష్కము తాళజాలకపోయినది.

సూర్యాస్తమయ మైనది. హజారమున నేడుగంటలు కొట్టినారు. ప్రభువులకు భోజన మొనరించు నిచ్ఛలేదు. కాని శుష్కోపవాసము చేయరాదు. దీక్షావిరమణ కిది చివఱిరోజు. ప్రభువు లేచి స్నానాదికములు నిర్వర్తించుకొని యొంగిలి పడినారు.

మహారాణి గడచిన రేయి సార్వభౌమాగమనము నాశించినది. కాని ప్రభువులు రాలేదు. విలాసినీవృత్తాంతము, తన స్వప్నవృత్తాంతమును, తుకారాంబ ప్రతీకారవాంఛను, ప్రభువులకు నివేదించువఱకు నామెకు శాంతిలేదు. దాసివచ్చి మహారాణికి ప్రభువుల యాగమనమును నివేదించినది. మహారాణి ప్రభువులకు స్వాగతసన్నాహము లొనర్చి సిద్ధపడినది.

సార్వభౌము లేతెంచినారు. మహారాణి ప్రభువులకు స్వాగత మిచ్చినది. స్వర్ణకలశోదకములఁ గొనివచ్చి పాదప్రక్షాళన మాచరించి తడియొత్తినది. ప్రభువులు తల్పమున నును మెత్తనిపట్టుపట్టంపుగద్దియ కానుకొన్నారు. మహారాణి వేత్రాసనమున సమీపముననే కూరుచుండెను.

సార్వభౌము లనినారు— 'మహారాజ్ఞీ ! మా యంతః పురమునకు నేఁడొక వృద్ధను బంపినాము. వచ్చినదా ?'

"చిత్తము !"

"ఆమెతో మాటాడితివా ?"

"కొలఁదిసేపు మాటాడితిని."

"ఆమె యుదంతము వింటివా ?"

"చెప్పినది. విరూపాక్షతల్లియట. తుకాంబ మేనయత్తకుమారుఁడైన జగన్నాథపాత్రుఁడు విరూపాక్షను బంపినాఁడట !"

"తుకాంబ విషయమేమైనఁ జెప్పినదా ?"

'లేదు'

మహారాణిహృదయము వేగముగఁ గొట్టుకొన నారంభించెను.

"అచటికేఁగినపిమ్మట తుకాంబకొక కొమార్తె జన్మించినదట !"

మహారాణిముఖము మ్లానమయ్యెను. కంఠము రుద్ధమయ్యెను. కన్నీరు ధారలుకట్టినది. మహారాణిమోమును గాంచి నారు సార్వభౌములు— "మహారాజ్ఞీ ! ఏమిది ? నీ యీ దుఃఖమునకుఁ గారణమేమి ?"

"ప్రభూ ! ఈదాసురాలిని క్షమింతుమని మాట నిచ్చినచో నివేదింతును."

"భయములేదు !"

"ప్రభూ! ఈయుదంతము నే నెఱుఁగుదును. కాని ప్రభువులమనసునకు బాధకలుగునని తమతో వచింపలేదు. నే నొనర్చినపాపమునకు ఫల మనుభవించుచున్నాను."

"ఏమది?"

"స్వామీ! ఆమె వెడలినప్పటికే మూఁడునెలల గర్భవతి. ఆవిషయము నాకుఁ బిమ్మట తెలిసినది. రాజసంతానమునకు సహజముగ వాటిల్లుచుండు ప్రమాదముల నాశంకించి యామె బయటపెట్టలేదు. ఆమె వెడలినపిమ్మట వింటిని. ప్రభువుల యెదుట నామెవిషయ మెత్తుటకు సాహసింపలేకపోతిని."

సార్వభౌములు నిలువునఁ గూలిపోయిరి. ఈవిషయ మానాఁడే తెలిసిన నెంతబాగుండెడిది ! మహారాణిపైఁ గోపము కలిగినది. కాని గడచినదానికై వగచి ప్రయోజనము లేదు. ఈవిషయము నేఁడు తెలియకున్న నెంతబాగుండెడిది ! పాప ఫలము ! విధివిధానము !

"మఱి యామెకొమార్తె యేమైనట్లు? సార్వభౌములు సోద్వేగులై యడిగినారు.

"స్వామీ! ఈవిషయము నాకుసైతము మొన్ననే తెలిసినది. నిన్ననే తమకు విన్నవింపదలఁచితిని. కాని నిన్న ప్రభుదర్శనము కాలేదు."

"ఎట్లు తెలిసినది?"

"విలాసినిఁ జూచినపిమ్మట !"

"విలాసినియా ?" ప్రభువు లాశ్చర్య చకితులైరి.

"చిత్తము !"

తా నాశంకించినది నిజమేనా ? విలాసిని వేశ్య! నర్తకి తనకొమార్తెయా ? సార్వభౌముల కున్మాదముకలిగిన ట్లైనది. ఆలోచింపఁజాలకపోయినారు. అప్రయత్నముగ వారినోట వెలువడినది— 'నీకెట్లు తెలిసినది ?'

ప్రభువులు మొన్న ఇచటికే తెంచినప్పుడు ప్రస్తావవశమున విలాసినివిషయ మెత్తినంతనే ప్రభువులు తుకాంబ పరిసక్తిఁగొనివచ్చి చింతాక్రాంతులైనారు. అందుచే తుకాంబ గర్భిణివిషయము నే నెఱుంగుదునుగాన విలాసినిని పిలిపించి మాటాడినాను."

"ఆమెయే చెప్పినదా?"

"ఆమెకు తెలియదు. ఆమెనుపోషించిన వేశ్య పేరుమాత్రము చెప్పినది."

"ఈమె తుకాంబకొమార్తెయని యెట్లు తెలిసినది ?"

"ప్రభూ! చంద్రలేఖ యను దాసితల్లి తుకాంబతో నేగినది. తుకాంబమరణించినపిమ్మట నామెతల్లి కొండవీటిలో నివాసమేర్పఱచుకొనినదట. చంద్రలేఖ యప్పటికి పది సంవత్సరములబాలిక. ఆమెతల్లి యచటనే నివసించినది. తల్లిచనిపోయిన పిమ్మట పినతల్లివద్ద కిచటికి వచ్చినది.

"అంతమా్త్రమున నీమె తుకా్కంబకొమా ర్తెయని యెట్లు తెలిసినది? విలాసిని తననివాసము కొండవీఁ నిడ నందుననా?"

"కాదు. విలాసినిని పెంచిన వేశ్యమాత పేరు మంగమ్మ యట! చంద్రరేఖతల్లి మంగమ్మయింటికి సమీపముననే యుండెడిదట! ప్రతిదినము మంగమ్మయింటికేఁగి యామెకుమార్తె నెత్తుకొని ముద్దాడుచుండెడిదట! ఆపిల్ల మంగమ్మకుమార్తెయా యని నేను శశిరేఖనడిగితిని. ఆపిల్ల తనకుదొరికినదని యావేశ్య మాత చెప్పినదట. పిమ్మట నే నూహించుచున్నాను—తుకా్కంబయే పాత్రునివలని భయముచే నాపిల్లను దానికిచ్చి పంపియుండును.

సార్వభౌము లీయుదంతము విని నిలువెల్ల కంపించినారు. అతనికంఠము రుద్ధమయ్యెను. మస్తిష్కము క్రియాశూన్యమయ్యెను. దృష్టు లర్థరహితముగ నుండెను. కనులు చెమ్మగిలియుండెను. 'ఎంతపాపము!' వారినోటివెంట నప్రయత్నముగ వెలువడెను.

"ప్రభూ! పాపమొనర్చినది నేను. తుకా్కంబను పొట్టనఁబెట్టుకొనినది నేను. ఆమెపుత్రిక వేశ్యయగుటకుఁ గారణమను నేను. ఆపాపమునకు ఫలిత మనుభవించినాను. అనుభవించుచున్నాను. పుత్రుని పొట్టఁబెట్టుకొంటిని. ఇఁక వంశము నిలువదు. తుకా్కంబయే చెప్పినది."

"ఎప్పుడు"

"మొన్న స్వప్నమున"

"ఏమనినది ?"

రాణి స్వప్నవృత్తాంతమును నివేదించినది— "యువరాజు చనిపోవుట కీపాపమే కారణము ! ఇంక నాకు సంతానయోగము లేదు. దత్తతయు నిలువదని రాజగురువులు స్వప్నఫలమును జెప్పినారు." రాణి ముఖమునకుఁ జేతు లడ్డముపెట్టుకొని దుఃఖించుచున్నది.

సార్వభౌములు తల్పముపై వ్రాలిపోయినారు. వారి దృష్టి శూన్యముగ నున్నది. వారిమనసున మహారాణిపైఁ గోపములేదు. తనస్థితికివిచారమును లేదు. తుకా్రంబపై ననురాగములేదు. ఆమస్తిష్కమున నేభావమున్నదో తెలియదు. వారియెదుట సాక్షాత్కరించినది— పత్నీహత్యాపాతకము ! ఆపాపాకృతినే నిర్నిమేషదృష్టిఁ జూచుచున్నారు. ఆపాపాకృతి భయంకరరూపమును దాల్చినది. సార్వభౌములు లక్ష్యపెట్టి చూచుచున్నారు. ఆపాపాకృతి భయంకరాతిభయంకరమై బ్రహ్మరక్షస్సువోలె నైనది. లోలుపదృష్టితో నాలుక బయటవెట్టినది. కరాళదంష్ట్రలు బయటపడ విక్రృతాట్టహాసము గావించుచున్నది. కనులనుండి నిప్పులు రాలుచున్నవి.

"ఎవర వీవు ?" అని ప్రశ్నించినారు ప్రభువులు.

"నీవొనర్చిన పత్నీహత్యా పాపమను."

"ఏమికావలె?నాదు ప్రాణములా ?"

"కాదు నీసర్వనాశనము! నీవంశనాశనము !! నీసామ్రాజ్యవినాశనము !!!"

"నేను పాపమొనర్చినచో నన్నుఁ జంపుము. నావంశమును నిర్మూలింపుము. సామ్రాజ్యము నేల నాశనము చేయవలె ?"

"నీ వంశనాశనమెట్లును తప్పదు. నీవామె నాదరించి గౌరవించుచో నీసామ్రాజ్యముండును."

"అట్లె యొనర్తును."

'మాటతప్పినచో నీకుమూర్తె యుండదు. నీయల్లుఁడుండడు ! జాగ్రత్త ! ఆమె కెట్టిలోటును కలుగనీయరాదు. ఏమందువు ?'

'తప్పక ! అట్లెయొనర్తును. ఎట్టిలోటును నుండదు.'

భూతము శాంతించినది. భయంకరరూపము మాయమైనది. ముఖమున శాంతము ద్యోతకమైనది. శాంతముఖము దరహాసితవదన మైనది. తుకాంబ ప్రత్యక్ష మైనది. ప్రభువులామెను చేరఁదీసినారు. ముద్దిడుకొనినారు. గ్రుచ్చి కౌగలించుకొనినారు. ఆమె ప్రభువును పెనవేసుకొనిపోయినది. ఎంతసేపు వా రట్లుండిరో తెలియదు. మెల్లగ తుకాంబ ప్రభువుల యాలింగనపాశమునుండి జారిపోయినది. ఆకసమున లీనమైపోయినది. ప్రభువు లులికిపడి లేచిరి.

మహారాణి మోమునఁ జేతు లడ్డముపెట్టుకొని విలపించు చునే యుండెను. ప్రభువులు 'మహారాణీ!' యని కేకవేసిరి. ఆకేకకు రాణి తలయెత్తినది. ఆమెకండ్లు వాచియున్నవి. అర్థశూన్యములైన దృక్కులను ప్రభువు వైపునకుఁ బ్రసరింపఁజేసినది. నోట మాట రాలేదు.

"మహారాణీ! విచారింపఁ బనిలేదు. సమస్తము తేలిపోయినది."

మహారాణియం దెట్టి చలనమును లేదు. ప్రభువుల దృష్టి తీవ్రగంభీరముగ నుండెను.

'మహారాణీ! కృష్ణరాయలతో నీ తుర్వసు వంశము సమాప్తము గావలసినదే! సందియములేదు. ఇందుకుఁ బ్రతీకారమొండులేదు. తిరుమలాంబ యున్నది. ఆమెయే మనకుఁ బుత్రిసమము. అళియరామరాయ లున్నాఁడు చాలును! అతఁడే సామ్రాజ్యమున కుత్తరాధికారి యగును. ఎట్టి యదృష్టవంతులకోగాని వంశవృద్ధికాదు. ఈ వంశ మింతటితో నంతరింపవలెనని విధి విధానము! తప్పించుకొనుట మనవలన కాదు. సందియము లేదు. విలాసిని తుక్కాంబ కుమార్తెయే!—నాపుత్రికయే! ఆమె నాదరించి గౌరవించుచో సామ్రాజ్య మింకను గొన్నినాళ్ళు నిలచును. కొంతలోఁ గొంత విధి యనుకూలుఁడైనాడు. అందువలననే యామెకు గోపమంత్రి ప్రియుఁడగుట తటస్థించినది. గడచిన దానికై వగచి ప్రయోజనములేదు.

మహారాణి మాటాడలేదు. ప్రభువులు తల్పముపై మేను వాల్చినారు. మహారాణి సార్వభౌములపాదములచెంతఁ జేరినది.

ఆమె మనసున కింకను శాంతిలేదు. పాపభీతి యింకను నామెను వీడలేదు. తన తిరుమలాంబయైనను దక్కునా ? తన యల్లుఁనకైనను సామ్రాజ్యము లభించునా? తనప్రభువు తనకు దక్కునా ఈయాలోచన వచ్చుటయే తడవుగ నామె నిలువెల్లఁ గంపించి పోయినది. ఆమెకిపుడు పుత్రకాంక్ష లేదు— సామ్రాజ్యకాంక్ష లేదు. తనప్రభువులు క్షేమముగనుండి తన మాంగల్యమునకుఁ గొఱతరాకుండిన చాలును. మహారాణి ప్రభుపాదపద్మములచేఁత శిరము వాల్చినది. అశ్రుజలముతో ప్రభుపాదముల నభిషేకించినది.

—•••—

## —: ఉపసంహారము :—

సార్వభౌము లుషఃకాలముననే లేచి నిజసౌధమున, కేతెంచి కాలకృత్యములఁ దీర్చుకొనిరి. నేఁడే కలశోద్వాసనము సరస్వత్యుద్వాసనము జరుగును. సాయంకాలము శమీపూజా మహోత్సవము !

సార్వభౌములు దేవతా మందిరమున కేఁగిరి. దేవతోద్వాసనావిధులు పూర్తియైనవి. సామంతమండలేశ్వరు లింకను శమీపూజావసరముననూ, ఊరేగింపునను బాల్గొనవలసియున్నను సార్వభౌములవద్ద నిప్పుడే నిజనగరములకేగుట కనుజ్ఞఁగొనుట యనూనాచారము.

సామంతమండలేశ్వరు లొక్కరొక్కరే లేచి సార్వభౌములకు నమస్కరించి కాను కలర్పించి, సెలవు గైకొనుచుండిరి. ప్రభువులు వారిని పరామర్శించుచుండిరి. గోపమంత్రి లేచి సార్వభౌములకు నమస్కరించి కానుక లర్పించెను. సార్వభౌములు గోపమంత్రితో— 'అమాత్యశేఖరా ! మీరు మాతో నొకపర్యాయము రాజభవనమునకు రావలెను అనిరి.

గోపమంత్రి 'చిత్తము' అని కూర్చుండెను.

సభాకార్యక్రమము పూర్తియైనది. సార్వభౌములు గజాధిరూఢులై బయలుదేరిరి. వారివెంట గోపమంత్రిగూడ నుండెను. సార్వభౌములు నిజభవనమున నేకాంతగృహమున కేఁగి గోపమంత్రిని లోనికిఁ బిలిపించిరి.

సార్వభౌముల యాసనమున కెదురుగ నొక యాసన మున్నది. ప్రభువులు గోపమంత్రి నద్దానిపైఁ గూర్చుండ నియోగించిరి. గోపమంత్రి యుపవిష్టుఁ డయ్యెను.

సార్వ:—'అమాత్యశేఖరా! ఒక మహాపాపము సంభవించినది'

గోప:—'ప్రభూ! ఎవరివలన ?'

సార్వ:—'మావలననే!'

గోప:—ప్రభువుల వలననా? ఎంతమాట!

సార్వ:—యదార్థమే! మీరు బ్రాహ్మణులుగదా! పాపమునకుఁ దగిన ప్రాయశ్చిత్తవిధానములు మీరెఱింగియే యుందురు.

గోప:—ప్రభూ! ఆవిషయములందు నాకుఁ బ్రవేశము లేదు నేను నియోగిని. రాజగురువులే యందుకు సమర్థులు.

సార్వ:—కాదు! అయ్యది మీ సాయముననే నెఱవేఱవలె.

గోప:—ప్రభూ! పరులపాపము నుపశమింపఁజేయుజాలువాఁ డెంతటి తపస్సంపన్నుఁడై యుండవలె? సంసారసాగరమున మునిఁగి తేలు నావంటివాఁ డందులకు సమర్థుఁ డగునా?

సార్వ:—సమర్థులనియే మిమ్మర్థించుచున్నాము.

గోప:—శివ! శివ! ఎంతమాట. ప్రభువులు నన్నర్థించుటయా? ఆజ్ఞాపింపుఁడు. నావలన నగుచో వెనుదీయువాఁడను కానని ప్రభువులకుఁ దెలియునుగదా!

సార్వ:— అందువలననే మి మ్మర్థించుట !అప్పాజీవారికి మేనయల్లుండ్లయిన మీకు నాకెంతటి యాప్తులో మీరెఱుఁగరా ?

గోపమంత్రి కేమియు నర్థమగుట లేదు. ఏమిటీసంభాషణము? సార్వభౌముల యుద్దేశ్యమేమి? వారొనర్చిన పాపమేమి? తత్పాపోపశమనము నావలన నెట్లగును ?

గోప:— ప్రభూ ! ఆజ్ఞాపింపుఁడు !

సార్వ:—చెప్పినపిమ్మట వెనుదీయరాదు.

గోప:—ప్రభువుల శ్రీ చరణములయాన.

సార్వ:—మంత్రిశేఖరా ! విలాసిని మాకు తుకాదేవివలన కలిగిన సంతానము ! మే మొనర్చిన యపచారమున లోకులదృష్టిలో నామె వేశ్యయైనది.

గోపమంత్రి మోమున భయసంభ్రమాశ్చర్యములు పొడసూపెను— "ప్రభూ ! భృత్యుని క్షమింపుఁడు"

"అమాత్యశేఖరా! మీరొనర్చిన యపరాధ మిం దేమియు లేదు. ఇదియంతయు విధివిధానము. ఆమెను యథాపూర్వముగ నేలుకొనుడు ! ఆమె కెట్టిలోటును గలుగనీకుడు. మాకుఁ గావలసిన దంతియే ! ఏదియో పుణ్యలేశ ముండబట్టి మీకు ప్రేయసియైనది. కాని మాదొక కోరిక యున్నది."

"ఆజ్ఞాపింపుఁడు" గోపమంత్రి స్వరము వణఁకుచుండెను.

"ఆమె నిఁకనుండి నృత్యప్రదర్శనములు జరుపకుండ జూచి మాగౌరవమును నిలువఁబెట్టుడు."

"చిత్రము !"

మఱియొక విషయము! కంభము తుక్కాంబ కరణముగ సీయఁబడినది. కాన నాదుర్గమును విలాసిని కరణముగ నొసఁగు చున్నాము. ఆమెరహస్యమును దాచుటయో లేక ఆమెకుఁ దెలియఁజేయుటయో మీయిష్టముపై నాధారపడియున్నది. కాని ఆమె నప్పుడప్పుడు మాకు చూపించుచుండుడు! మాకంతియే చాలును!" ప్రభువు కంఠము సగద్గద మయ్యెను.

ప్రభువు ద్వారపాలకునిఁ బిలిపించినాఁడు. వానిచే రాయసూత్రధారికిఁ గబురు పంపినాఁడు. రాయసూత్రధారి వచ్చినాఁడు. ప్రభువాతనిం గాంచి— "శాసనాచార్యా! కంభమును విలాసిని కొసంగినట్లు శాసనము వ్రాయిరేపుఁడు!" అని నియోగించెను. రాజాజ్ఞ గొని శాసనాచార్యుఁడు వెడలి పోయెను.

అనంతరము ప్రభువులు గోపమంత్రిని పంపివేసి ధన్నాకుయనకుఁ గబురుపంపెను. ధన్నాయకుఁ డేతెంచి సార్వభౌముల కభివాదన మాచరించి నిలువఁబడెను. ప్రభువాతనితో— "కంభమున జగన్నాధపాత్రుఁడు విరూపన్ననుఁ జంపి దుర్గమును వశపఱచుకొనినాఁడట! సైన్యమునుబంపి పాత్రుని బంధించి దుర్గమును లోఁగొనుము! పిమ్మట మనసైన్యముచే నచట నొక తటాకమును త్రవ్వింపుము!"

ధన్నాయకుఁడు నమస్కరించి వెడలిపోయినాఁడు సార్వభౌమునకుఁ గొంత మనశ్శాంతి కలిగెను. పిమ్మట ప్రధాన

సంప్రీతుఁడైన అల్లాలనాథునిఁ బిలిపించి విరూపన్నతల్లికి భరణమేర్పాటుగావించి లేపాక్షి వీరభద్రస్వామి యాలయమున విరూపన్న పేరుతోఁ బూజావిధుల కేర్పాటు చేయింపుమని యాజ్ఞాపించిరి.

సాయంకాలము కావచ్చినది. శమీపూజ కేఁగువేళ యైనది. తరణిబింబము చిఱుమేఘముల మాటున దోబూచులాడుచున్నది. మావటీండ్రు గజాధిరాజముల నలంకరించి వచ్చిరి. యవనాశ్వము లలంకరింపఁబడి సిద్ధముగ నున్నవి. రాజగురువులు, ప్రధానామాత్యులు, అమాత్యవర్గము సార్వభౌముల యాగమనమునకై నిరీక్షించుచుండిరి.

ప్రభువుల యుత్సవాలంకరణము పూర్తియైనది. కంచుకీజనపరివృతులై ప్రభువులు బయటకేతెంచిరి. సమీపమున నున్న దొరల చేదండగొని భద్రగజాధిరాజము నధిరోహించిరి. ఇరువైపుల నేనుగులపై సామ్రాజ్యశ్వేతచ్ఛత్రము లుండెను. సార్వభౌములకు వెనుక చిన్న యేనుగులపై రాజగురువులు, ప్రధానామాత్యులు, మంత్రివర్గమును బయలుదేరెను, సామంతులు దండనాథులు, సంప్రతులు, ఇతర రాజకీయోద్యోగులు నశ్వములపై నెక్కి ప్రభువుల ననుసరించిరి. ప్రభువులకుముందు సాయుధసైనికదళము దారిఁ జూపుచుండెను.

సార్వభౌములు రాచనగరుదాటి సభాభవనమువద్ద కేతెంచిరి. అచట ప్రభువులకై వేచియున్న అమరపట్టినాయకులసేనలు సార్వభౌముల ననుసరించినవి. మల్లులు, వారాంగ

నలు సాముచేయువారు, భజనబృందములు, స్వస్తివాచనము సలుపు బ్రాహ్మణులు వారి ననుసరించిరి.

ఈసముదాయమంతయు ప్రాకారముదాంటి బయట కేతెంచెను. అచట నుత్సవదర్శనోత్సుకమైయున్న జనసముదాయము కలసి యొక మహోదధి ననుకరించెను.

వారాంగనలు నృత్య మొనర్చుచుండిరి. వారికొఱకు జనసముదాయ మాగనక్కర లేదు. వారాంగనలకై మేళమున కొక రథము ప్రత్యేకింపఁబడియుండెను. వారారథములపై నెక్కి సార్వభౌముల కభిముఖులై నృత్యమొనర్చుచుండిరి. ఎన్ని మేళములునృత్యమునఁ బాల్గొనెనో చెప్ప నలవికాకుండెను.

దొమ్మరులు కఱ్ఱసాములు చేయుచుండిరి. మల్లులు మల్లవిద్యాప్రదర్శన మొనరించుచుండిరి. భజనబృందములు భజనలు సల్పుచుండెను. సార్వభౌములవెనుక బ్రాహ్మణులు స్వస్తివాచనములు సల్పుచుండిరి.

ఉత్సవసముదాయము రాజవీధులవెంట శమీవృక్షమును జేరినది. ప్రభువులచే రాజపురోహితులచట ఆయుధపూజలు చేయించిరి. పూజావిధానములను నిర్వర్తించి విప్రుల యాశీస్సు లంది ప్రభువులు మఱల భద్రగజాధిరూఢులై యూరేగింపునకు బయలుదేరిరి.

తమటములు, కాహళులు, భేరీ మృదంగములు, ఢక్కలు డవిణెలు నాగస్వరము శంఖములు మున్నగు వాద్యఘోషలు

మిన్నుముట్ట కోలాహలముగ నూరేగింపు సాగినది. ప్రధాన రాజవీధులన్నియుఁ దిరిగి నాయావీధులందు బ్రాహ్మణుల యాశీస్సులను, క్షత్రియుల కానుకలను శూద్రుల వందనము లను, వారాంగనల కర్పూరనీరాజనములను గ్రహించుచు సార్వభౌములు రాచనగరును సమీపించిరి.

ప్రథమద్వారమువద్దనే పౌరులు నిలిచిపోయిరి. రెండవ ద్వారమువద్ద సైనికు లాగిపోయిరి. రాజభవనమువఱకు నేఁగి రాజగురువులును ప్రధానామాత్యులును పురోహితులును మఱలిరి.

సుందర సుదతీమణు లిరువురు కనకకుంభములనీరు గొని వచ్చి పాదప్రక్షాళన మాచరించి తడిఁయొత్తిరి. ఒక చంద్రవదన బంగరు చెంబున నెత్తురునింపి ప్రభువునకు దృష్టి తీసినది. వేఱొక ముదిత నీరాజన మిచ్చినది. ప్రభువులు భోజన మొనర్చి సౌధాగ్రభాగమునుండి కొలదిసేపు రాచనగరున తనకభిమానపాత్రుఁడైన బొమ్మలాట విరూపాక్షుని బొమ్మ లాటను దర్శించి శయనించుట కేఁగిరి.

మరునాఁడే విలాసినీగోపయామాత్యుల కొండవీటి ప్రయాణము !

—•••—